# విభూతి

సంపాదకులు
పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సారస్వత ధార్మిక మాసపత్రిక



పుండ్రము ౩ • శా॥ ౧౮౬౩ వృష-కార్తికము – సికింద్రాబాద్ • రేఖ ౪
Vol. 3. • 25th October 1941 – Secunderabad • No. 4



సంవత్సర చందా ౩-౮-౦
విడి సంచిక ౦-౪-౦

# విభూతి – విషయసూచిక

వృష - కార్తికము




సారస్వత ధార్మిక మాసపత్రిక

పుంద్రము ౩ Vol. 3 | శా ౧౮౬౩ వృష, కార్తికము—సికింద్రాబాద్ 25th October 1941-Secunderabad | రేఖ ౪ No. 4


# సంకల్ప వీథి


శ్రీ కవిరత్న లక్కన మల్లికార్జునుఁడుగారు


చ. అవిరళభక్తిశుద్ధ మగు నాత్మను శంభున కర్పణంబు జే
సి, విమలవర్తనంబులకుఁ జేరుచు, కామ్యవితానమూల దు
స్సవన విదారినామమును సంస్మరియింపుచు హాయిగా జగ
ద్భవభయ మూడ్చి హర్షఘన వారిధిఁ దేలి సుఖింపనేర్తునా!

చ. ఎలుకను పిల్లి చంపి తిను నింగితమూఁ ఘనమంచు పొట్టకై
పలువురి మోసపుచ్చి ధనవంతులునై సుఖియింపఁ గోరు నా
తులువలు బోవు ద్రోవలకుఁ దొర్లక గాలిని బీల్చి ప్రాణముల్
నిలిపెడి యమ్మహామునుల నిర్మల సేవ లెసంగ నోతునా! ౨

ఉ. రోగమయంబు నీ తనువు, రోషమయంబు మనంబు, క్షుత్తుచేఁ
గ్రాఁగెడి యింద్రియమ్ములు, చికాకు లొసంగు క్రియాపిశాచముల్
భోగ లవమ్ము నీయని స్వపుత్రులు నో పరమేశ! యింక నే
లాగునఁ జిక్కు శాంతి? సుఖలాభపు వాంఛలఁ బోవఁ జేతునా! 3

శా. ఆనందంబున గాల మెల్ల గడుపన్నాసించి మోహాంధతన్
నానాకర్మచయంబు లందుఁ బడి యెన్నాళ్ళో శ్రమల్ బొందినన్

నే నెందుఁ గ ఫలమందలేదు భువి ఛీ నీచుండనై దుఃఖినై
యీ నా డుండఁగ నేల నిశ్చలముతో నీశాంఘ్రి సేవింతునా! ౪

ఉ. మండెడి యగ్నిలోఁబడి విమానుఁడనై యరికోటిముందు ను
ద్దండపు దండ మందుచును తాలిమి లేమిని ఘోరకాలు కో
దండముచేతఁ జిక్కి యతిదారుణతాపము నొందకుండఁగా
నిండుమనంబుతోఁడ శివ! నిన్మదిఁ బ్రార్థన సేయ నేర్తునా! ౫

ఉ. ఏల కవిత్వవాంఛ, మఱియేలను భోగచయాభిలాష, యిం
కేల యశమ్ముపై మమత యేల విశుష్కమహోద్యమక్రియల్
కాలుని బాధదప్ప మఱి గానము సౌఖ్యలవ మ్మటంచు నా
బాలశశాంకమౌళిపద పద్మమె దిక్కని గొల్వ వోదునా! ౬

ఉ ఎంతభుజించినన్ గడు పదేడ్చును రెండవనాడె యట్లు శ్రీ
కాంతను దెచ్చి యిచ్చినను కాంతలు నా మరునాడె కోర్కెత్తనా
వింతల కోర్కెలీయఁ డని వేడుట దప్పరు యాచకాళి సా
మ్మంతయుఁ గొన్నపట్టరు యయాచితదీక్ష నటంచు నెంచి, ర
వ్వంత మనమ్ము నీకిడి భవాంతము నొందెదు యుక్తిఁ గాంతునా! ౭

ఉ. ఎన్నడు కాశికాపురమహేశజటాస్థితగాంగనీర సం
క్లిన్న పవిత్రగాత్రిత నఖిన్నుఁడనై నిరవద్యశైవ వి
ద్యోన్నతమంత్రరాజ పఠనోత్సుకతన్ గలకాలమెల్ల వి
చ్ఛిన్నములేక యాపనముఁజేసెడు భాగ్యముఁ జూరగొందునో! ౮

---

# భస్మధారణ సమాధానము

సంక్షిప్త శివపూజావిధిలో హస్తమధ్యమందలి మూడువేళ్లతో భస్మము ధరింపవలె నని యుండగా సిద్ధాంతశిఖామణి (౬-౩౬) లో మధ్యమ, అనామిక, అంగుష్ఠములతో, అనులోమవిలోమముగా ధరింపవలె నని యున్నది. ఏది సరియైన దని నర్సాపురం శ్రీ చదువుల బసవశంకరయ్యగారు వ్రాసెరి. ఇది ముఖ్యమైన ప్రశ్నయే! సిద్ధాంతశిఖామణి ఆరవపరిచ్ఛేదము ౩౫వ శ్లోకమున "మధ్యాంగులి త్రయేణైవ స్వదక్షిణ కరస్యతు" కుడిచేతియొక్క చూపుడువ్రేలు, నడిమివ్రేలు, దర్భవ్రేళ్లతో ధరింపమని శివపూజావిధి ప్రకారమే సామాన్యముగ చెప్పబడియున్నది. మరి ౩౬వ శ్లోకమందలి "బొటనవ్రేలు, నడిమివ్రేలు, దర్భవ్రేళ్లతో పైనుండి రెండు రేఖలుగాను, క్రింది నుండి యొక రేఖగాను ధరింప మను" నది సామాన్యవిషయముకాదు. అట్లు ధరించి త్రిపుండ్రములుగా నేర్పరుచుట దుస్సాధ్యమైన కార్యము. కావున నది యోగీశ్వరులు మున్నగు వారికే చెల్లును. సామాన్యముగ శివపూజావిధిలోని విధముగనే ధరింపవలెను. —సం. వి.

# శివపంచస్తవములు

శ్రీ బండారు తమ్మయ్యగారు

క॥ శివమహిమముఁ గీర్తించుచుఁ, దవిలిన శివభక్తి జనులు తరియించుటకై
శివసంస్తవము నొనర్చిన, శివకవిచంద్రులకు శరణు చేసెద నెపుడున్.

ప్రపంచమందలి ప్రతిజీవియు సాధింపవలసిన పరమార్థము చతుర్విధ పురుషార్థములలో నుత్తమమగు మోక్షమనుట యెల్లరకును దెల్లము. ఇట్టి మోక్షమును బడయుటకు ముఖ్యసాధనము సంసార బంధ విచ్ఛేదన మని జ్ఞానులు వచింతురు. పశురూపులగు జీవులకుఁ బాశరూపకమగు నీ సంసారబంధము పాయుటకుఁ బశుపతియగు పరమేశ్వరుని కరుణాకటాక్షము కన్న మాఱు మార్గములేదు. భగవంతుని యందలి యనన్య భక్తియే యాతని కృపను బడయుటకుఁ బరమ సాధనము. కావుననే "భక్తి లేక ముక్తిలేదు" అని పెద్దలు చెప్పెదరు. నిరతిశయమగు భక్తిమూలముననే జీవునకు జ్ఞానవైరాగ్యములు క్రమముగ లభ్యమయి తన్మూలముననే పరమేశ్వరైక్యానురూపకమగు మోక్ష సుఖము సంప్రాప్తమగును. భగవద్భక్తిని బడయుటకు నెల్లజీవులకును నధికారము గలదు. పూర్వజన్మ సంస్కారమున నేమి, పరమేశ్వరుని కరుణా ప్రసాదమున నేమి యనన్య సామాన్యమగు భక్తి వశమయినప్పుడు క్రిమికీటకాదులయినను భగవత్కటాక్షమును జూఱగొని మోక్షము నందనేర్చును. ఇందుకు శ్రీకాళహస్తీశ్వరుని సేవించి ముక్తి నొందిన జంతువుల చరిత్రియే తార్కాణము. అందువలననే,

శా॥ ఏ వేదంబు పఠించె లూఁత, భుజగం బే శాస్త్రముల్ సూచెఁ దా
నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి, చెం చే మంత్ర మూహించె బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా? కావు, నీపాద సం
సేవాసక్తియె కాక జంతువులకున్ శ్రీకాళహస్తీశ్వరా!

అని భక్తాగ్రేసరుఁడు ధూర్జటి యుద్ఘోషించినాడు. భగవంతునియందలి భక్తిని బడయుట కాతని సంస్మరణమే సులభమయిన మార్గము. ఆధి, వ్యాధి, జరామరణ రూపకము లగు సంసారదుఃఖములను బెడఁబాయుటకు శివనామసంకీర్తనముకంటె మంచి మార్గములేదు. ఇందుచేతనే శైవ వైష్ణవ మతములలోఁ జిరకాలమునుండి యనేకములగు స్తవములు, సంకీర్తనములు నెలకొనినవి. అసంఖ్యాకము లగు శివస్తవములలో నయిదు మాత్రము పేరెన్నిక గాంచి చిరకాలమునుండి మనదేశమున శివపంచస్తవములను పేరితోఁ బ్రచారము నొందియున్నవి. వానిని గూర్చి యించుక ముచ్చటించుటయే యీ వ్యాస ప్రయోజనము.

శివ పంచస్తవములని సన్నుతి గన్న యీ యైదు స్తవములు సంస్కృత భాష యందే వేర్వేఱు కాలములలో వేర్వేఱు కవులచేఁ గూర్పబడి నట్లు కాననగును. ఆ యా స్తవము లాయా కవులచే నేయే సందర్భములలో నేయే ప్రయోజనములఁ బడయుటకు రచింపఁబడినవో తెలుపు గాథలుకూడఁ బారంపర్యముగ వినవచ్చుచున్నవి. నేనెఱిఁగి నంత వఱకు, ఆంధ్రదేశములోఁ దెలుఁగు లిపిలోఁ బ్రకటింపఁబడిన యీ పంచ స్తవములు, 1. మహిమ్నము, 2. మల్హణము, 3. బిల్హణము. 4. హాలాయుధము. 5. అనామయము. అనునవి. వీని నేకసంపుటముగఁ గూర్చి కాకినాడ వాస్తవ్యులు కీ॥ శే॥ శ్రీ పాడి వేంకట స్వామిగారు చాలఁ గాలము క్రిందట ననఁగా క్రీ॥ శ॥ 189౫ ప్రాంతమునఁ బ్రకటించి యున్నారు. కాని ముద్రణము పరిశుద్ధమయినదికాదు. కాగితములుకూడ మంచివికావు ఈ గ్రంథ ప్రతి నా మిత్రులు శ్రీ నిడుదవోలు వేంకటరావు ఎం. ఏ గారు నాకొసంగి యున్నారు. వారికిఁ గృతజ్ఞుడను.

వీనిలో మహిమ్న స్తవమునకు శ్రీ పన్నాల రామబ్రహ్మశాస్త్రిగారును, మల్హణ స్తవమునకు శ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారును, బిల్హణ స్తవమునకు శ్రీ పింజ మూరి లచ్చారాయకవిగారును నప్పటికే రచించిన యాంధ్రపద్యములను గూడఁ జేర్చి శ్రీ వేంకట స్వామిగారు పూర్వోక్తప్రతిని బ్రకటించి యున్నారు. అటుతరువాత వీనిలో దండి విరచితమయిన అనామయ స్తవమునకుఁ గాకినాడ వాస్తవ్యులు శ్రీ శృంగారకవి సర్వా రాయకవిగారు ఆంధ్రీకరణము గూర్చి నట్లు తెలియుచున్నది. వారి సోదరులు శ్రీశృంగార కవి వేంకట రామకవిగారు హాలాయుధ స్తవమునకుఁగూడ నాంధ్రీకరణమును గావించి1940 సంవత్సరములోఁ బ్రకటించియున్నారు. తెలుఁగు లిపిలోఁ బ్రకటితమయిన శివపంచ స్తవము లన్నిటికి నిట్టు లిప్పటి కాంధ్రీకరణములుగూడ వెలసియున్నవి. మహిమ్న స్తవమును శ్రీ పన్నాల రామబ్రహ్మశాస్త్రిగారేకాక మఱికొందఱుకూడ నాంధ్రీకరించినట్లు వినవచ్చు చున్నది. ఆంధ్రదేశములోఁ బ్రస్తుతము పయిని జెప్పిన విధమున నీయైదు సంస్తవములు ప్రచారము నందుండఁ గర్ణాటదేశమునఁ గన్నడ లిపిలోఁ బ్రకటిత మయిన శివపంచ స్తవములలో బిల్హణ స్తవము లేక దానికి బదులు మలయరాజీయ మను స్తవము ముద్రింపఁ బడినది. ఈ కన్నడప్రతి 1910 ప్రాంతమున ముద్రింపఁబడినట్లు కాననగును. విభూతి పత్రికా సంపాదకులు శ్రీ వీరభద్రశర్మగారి వలన నది నాకు లభ్యమయినది. దానిలోఁ బంచ స్తవములకు విశ్వారాధ్యుఁ డను వీరశైవ పండితుఁ డొనర్చిన సంస్కృత వ్యాఖ్యాన మును, శాలివాహన శకము 1831 కీలక సంవత్సరములో శ్రీ బసవలింగస్వామి యను మఱియొక వీరశైవ పండితుఁడు రచించిన కన్నడ టిప్పణమును గలిసి ప్రకటింపఁబడినవి. సంస్కృత వ్యాఖ్యానకర్త విశ్వారాధ్యుఁ డెప్పటివాఁడో, ఎచ్చటివాఁడో తెలియఁదగు నాధారము లాతని వ్యాఖ్యానమునఁ గానరావు. కాని మల్హణ స్తోత్రవ్యాఖ్యాన సందర్భ మునఁ బాల్కురికి సోమనాథుఁడు కాంతాకచ ప్రచయేత్యాది శ్లోకములతో మల్హణుఁడు

స్తవము రచించినట్లు తన గ్రంథమునఁ బేర్కొన్నాఁడని వ్రాయుటచే నితఁడు సోమనాథునికిఁ జాలఁ దరువాతవాఁడని స్పష్టము కాఁగలదు. వ్యాఖ్యానారంభమున రచింపఁబడిన యీ క్రింది వాక్యములవలన నాతఁడు ప్రత్యక్షముగఁ గైలాసమున కేఁగిన శ్రీమత్తటాకాబ్జరాజారాధ్యుని యన్వయము వాఁడనియు, పరవాక్యతర్క భరతాలంకార సంగీతవిద్యా విశారదుఁడనియు, శివాగమాది వ్యాఖ్యాన కర్తయనియుఁ దెలియుచున్నది.

మఱియు నీ వ్యాఖ్యానముల చివర నీతఁడు గూర్చిన గద్య విధ మిట్లున్నది.

“ఇతి శ్రీమచ్ఛివాద్వైత సిద్ధాంత పారావార పారీణ విశ్వారాధ్య విరచిత శివ పంచస్తవ వ్యాఖ్యానే........స్తవ వ్యాఖ్యా సమాప్తా.”

ఈ వ్యాఖ్యానము సుబోధకమై పాండితీ ప్రదర్శకమై విశ్వారాధ్యుని శక్తిసామర్థ్యములను బాగుగాఁ బ్రకటించుచున్నది.

ఇది గాక యీ శివపంచస్తవములకు నాంధ్రదేశమున మఱియొక వ్యాఖ్యగూడ క్రీ॥ శ॥ 1520 ప్రాంతమునఁ దెనాలి రామలింగకవి యుద్భటారాధ్య చరిత్ర ప్రబంధమునకుఁ గృతిపతియైన ఊరదేచ మంత్రిచే రచింపఁబడినట్లు తెలియుచున్నది. ఈ యూరదేచ మంత్రి శైవాచార పరాయణుఁడు. శ్రీ కృష్ణదేవరాయల మంత్రిసత్తముఁడగు తిమ్మరుసు మేనల్లుఁడును గొండవీడుదుర్గపరిపాలకుఁడు నగు నాదిండ్ల గోపమంత్రికడ ముఖ్యోద్యోగిగా నుండినవాఁడు. ఇతఁడు ప్రోలనారాధ్యుని వంశమువాఁడగు చంద్రశేఖరవాచంయముని శిష్యుఁడయి యాతని వలన అఘోరాస్త్ర మంత్రము నుపదేశ మందినవాఁడు. మఱియు శ్రీకృష్ణదేవరాయల యాస్థాన విద్వాంసుఁ డగు లొల్ల లక్ష్మీధర పండితునియొద్ద విద్యల నేర్చినవాఁడు. ఆ పండిత ప్రకాండుని యనుగ్రహముననే శివపంచస్తవములకు వ్యాఖ్య నొనర్చితి నని యాతఁ డిట్లు చెప్పికొనినాఁడు. ఉద్భటారాధ్య చరిత్రయొక్క శ్రీ వే. ప్రభాకరశాస్త్రిగారి పీఠికలో,

“సచాయం దేచయామాత్యో మహిమస్తవ పంచికామ్
లక్ష్మీధర కటాక్షేణ కురుతే గురు తేజసా.”

ఈ దేచమంత్రి రచించిన వ్యాఖ్యానము ముద్రితమయినట్లు గానరాదు. దాని వ్రాత ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయములోనుండి యుండును. దేచమంత్రి తన వ్యాఖ్యానములోఁ గైకొనిన పంచస్తవములలో బిల్హణస్తవమున్నది, లేక మలయరాజీయస్తవ మున్నది విచారింపఁదగును.

ఈ పంచస్తవము లన్నిటిలోను మహిమ్నస్తవ మత్యంత ప్రాచీనమనుట నిర్వివాదము. పుష్పదంతుఁ డను గంధర్వుఁడు రచించినట్లు తెలియవచ్చు నీ శివస్తవము భరతఖండమం దంతటఁ జిరకాలమునుండి పఠన ప్రచారమందియుండుట యెల్లరకును దెల్లము. దీనికిఁ బూర్వోక్తములయిన రెండు వ్యాఖ్యానములే గాక మన యెఱుక కందని

యితర వ్యాసము లనేకములు వెలసియుండును. శ్రీ భట్టాచార్య కృతమగు వ్యాఖ్యానము వ్రాతప్రతియొకటి నావద్దనున్నది. చిట్టచివరను "శ్రీ భట్టాచార్య కృత మహిమ్నస్తుతి వ్యాఖ్యానం సంపూర్ణా"అని యుండుటకంటె వ్యాఖ్యాతను గూర్చిన వివరము లేవియు వ్యాఖ్యాన ముఖమునఁ గానరావు. మహాకవి కాళిదాసు నంతటివాఁడు మహిమ్నస్తవము లోని యీ క్రింది శ్లోకభావమును దన రఘువంశ కావ్యమున సంగ్రహించి యనువదించె నన్నచో నీ సంస్తవముయొక్క ప్రాచీనత గూర్చిగాని ప్రశస్తినిగూర్చిగాని వేఱ వివరింప నక్కఱలేదు.

శ్లో. త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషాం
నృణా మేకో గమ్య స్త్వమసి పయసామర్ణవఇవ.

శ్లో. బహుధాప్యాగమై ర్భిన్నాః పంథాన స్సిద్ధిహేతవః
త్వయ్యేవ నిపతంత్యోఘా జాహ్నవీయా ఇవార్ణవే.

(రఘువంశము 10 సర్గము, శ్లోకము 27)

కావున శివపంచస్తవము లన్నిటిలోను మహిమ్నస్తవ మగ్రగణ్యము, ప్రాచీన తమము నని నిరాఘాటముగఁ జెప్పవచ్చును. ఇఁకఁ దక్కిన నాల్గుస్తవములలో నాంధ్రదేశ మునఁ బూర్వకాలము నుండియు నే యే స్తవములు ప్రచారమందుండెనో యించుక పరిశీలింతము.

శివకవివతంసుఁడగు పాలకురికి సోమనాథుఁడు తన పండితారాధ్య చరిత్రములో దీక్షాప్రకరణమున మల్లికార్జున పండితుని లింగార్చనమును, శ్రీశైల యాత్రను వర్ణించు సందర్భమున హరలీల, మహిమ్నస్తవము, మలహణము, అనామయము, హలాయుధము, సంసారమాయాస్తవము"లను పర్వత ప్రకరణమున 'బాణగద్య, అక్షరగద్య, పంచగద్య, వ్యాసాష్టక, నీలకంఠస్తవ, రుద్రకవచ, శారభ, మయూరస్తవ, హలాయుధ, అనామయ, మలహణ, మహిమ్న, మలయరాజస్తవ " ములను బేర్కొనినాఁడు.

వీనిలో సోమనాథుఁడు మలయరాజీయమునే పేర్కొనెను గాని బిల్హణస్తవము నెచ్చటను బేర్కొనలేదు. బిల్హణుఁడు క్రీ. శ. 1060 ప్రాంతమునఁ గాశ్మీరదేశమునుండి వెడలి పశ్చిమచాళుక్య చక్రవర్తియగు త్రిభువనమల్ల విక్రమాదిత్యుని యాస్థాన మలంక రించి యాతనివలన విశేషగౌరవములనంది విక్రమాంకదేవ చరితమను ప్రబంధమును రచించిన మహాకవి. అనఁగా శ్రీపతి పండితారాధ్యుని కించుమించుగ సమకాలికుఁడు. అతనికి సోమనాథునకు నడుమ నొక శతాబ్దికన్న నెక్కుడంతరములేదు. అందుచే సోమ నాథుని కాలమునాఁటికి బిల్హణస్తవమునకు విశేష ప్రచారము లేదనియే తలంపనగును. కావున నది యప్పటికి శివపంచస్తవములలోఁ జేరియుండునని తలంచుటకుఁ దగిన యుప

కాశము లేదు. మలయరాజీయమే యంతకుఁ బూర్వము జిరకాలమునుండి ప్రచారమంది యుండును. అందుచే నదియే పంచ స్తవములలోఁ జేర్పఁదగినదని నా యభిప్రాయము.

ఈ పంచ స్తవములు రచింపఁబడిన కాలములఁ గుఱించియు అవి యే యే ప్రయోజనముల కయి యా యా కవులచే రచింపఁబడినవో తెలుపు గాథలను గూర్చియు సంగ్రహముగ వివరించెదను.

1. మహిమ్న స్తవము:— కాళిదాసునాఁటికే యిది ప్రచారమందియుండుటచేతను, శంకరాచార్యుఁడు దీనినిజూచియే తన శివానందలహరిని శిఖరిణీ వృత్తములతో నారంభించి రచించి యుండునని యూహింప నవకాశము లుండుటచేతను, నిది క్రీస్తుకు పూర్వము ఏడెనిమిది శతాబ్దులనాటికే రచింపఁ బడియుండు నని తలంపనగును. పుష్పదంతుఁడను గంధర్వరాజు ప్రతిదినము నొక మహీపతి యుద్యానవనమునఁ బ్రవేశించి యెవరికిఁ గనరాకుండ నందలి కుసుమముల నెల్లఁ గోసికొని పోవు చుండెను. ఉద్యానమందలి పుష్పములన్నియు నొక్కటయినఁ దక్కకుండ హరింపఁబడుట కెంతయుఁ జింతనంది యా భూవరుండు కుసుమాపహరుండగు చోరునిఁ గనిపెట్టి తన కప్పగించుటకయి కొందఱు రాజపురుషుల నియోగించును. కాని నిజ మహిమముచేఁ బుష్పదంతుఁడు పరుల దృష్టికగోచరుడయి కుసుమాపచయ మొనరించుటచే రాజపురుషులు చేయునది లేక తమ యసమర్థత నేలికకు విన్నవించిరి. అంత నా భూజాని శివనిర్మాల్యోల్లంఘనమునఁ జోరుని తిరస్కరిణీ శక్తి నశించి యాతఁడు తప్పక పట్టువడునని తలంచి యుద్యానసేవకులకా ద్వారమార్గమున శివనిర్మాల్యమును నిక్షిప్త మొనర్పుఁడని సేవకుల కాజ్ఞయొసంగెను. వారును నట్టు లాచరింపఁ బుష్పదంతుఁడా శివనిర్మాల్యము నుల్లంఘించుటచే నిజశక్తిని గోల్పడి యందుకుఁ గారణమును దివ్యదృష్టిచే గ్రహించి యాతఁడు ౩౯ శ్లోకములతో నీ స్తవమును నాశువుగా రచించి శివప్రసాదమునఁ దన మహిమమును మరలఁ బడసి కృతార్థుఁడయ్యెను.

మల్హణ స్తవము;— పూర్వకాలమునఁ గాశ్మీరదేశమున భారతపీఠమను పురమున సువర్ణభట్టారకుఁడను శివద్విజుఁడు నివసించుచుండెను. అతఁడు సకలవిద్యా పారంగతుఁడు. అతనికి మల్హణుఁడను కుమారుఁ డుదయించెను. తండ్రియుఁ గొడుకునకు సమస్త విద్యల నుపదేశించి తనంత వానిని గావించి యౌవనమందున్న యాతనికిఁ దాను జనిపోవునపుడు శతాయుఃపర్యంతము దినమున కొక్క వేయిరూప్యములు వెచ్చించినను తరుగ నేరని విత్తరాశి నప్పగించెను. శివాచార పరాయణుఁడయి కాలమును గడపుచు మల్హణుడొకనాడు శివాలయమునకేగి యందలి విజయేశ్వర లింగమును సేవించెను. అప్పుడే మల్హాణి యను వేశ్య స్వామి సేవకయి యచ్చటి కేతెంచెను. దాని రూపసౌందర్యములఁ జూచి మోహమును బట్టఁజాలక మల్హణుఁడు దానిని వరించెను. మల్హణియు నట్లే యాతని మోహించెను. అంత నా వేశ్యకై మూఁడుసంవత్సరములలోఁ దన విత్తమెల్ల వెచ్చపెట్టి

మల్హణుఁడు నిర్ధనుఁడయి యనంతరము వేశ్యమాత వలన మల్హణీ గృహమునుండి వెడలింపఁబడెను. మల్హణునియందు బద్ధానురాగ యయ్యును తల్లి యొనగూర్చిన మఱియొక ధనికుని పొందున మల్హణి కాలము గడపుచుండెను. వేశ్యమాతవలన నిట్లు తిరస్కృతుఁడయినను మల్హణుఁడు మల్హణీ విరహమును భరింపఁజాలక దాని వచనాకర్ణనమున నయినఁ బ్రాణముల నిలుపుకొన నెంచి యొకనాఁటి రేయి దాని యింటికేఁగి యెట్లో గోడనెక్కి రహస్యముగ దాఁగి దాని సల్లాపముల వినుచుండెను. మల్హణియుఁ గొంతసేపటికి శయనమునుండి లేచి మేఘచ్ఛన్నమై యంధకార బంధురంబగు నారాత్రి మెఱపుసాయమున నాతనినవలోకించి యాతనిని సత్కరించి సదనాంతరమున నాతనినుంచి,త్వరలో ధనికవిటునితోడి కూటమును ముగించి యాతని సాగనంపి యుదయముననే మల్హణునితో శివాలయమున కేఁగి "నాథా! క్షణికములగు కామసుఖముల వలనఁ బ్రయోజనమేమి. సత్కవీశ్వరుఁడవగు నీవు విజయేశ్వరుని స్తుతించి నీకును నాకునుగూడ శాశ్వత సౌఖ్యము నొనగూర్పరాదే" అని విన్నవించెను. ప్రాణేశ్వరి యగు వేశ్యచే నిటు ప్రబోధితుండయి వెనుకనుండి యామె గాఁగిలించి కొని యుండగనే యాక్షణము,

"కాంతాకచ ప్రచయ పుష్పసుగంధి గంధ
లుబ్ధభ్రమ ద్భ్రమరకర్బుర కంధరాయ
గంధర్వయక్ష సురసిద్ధకిరీట కోటి
సంఘట్ట ఘృష్టచరణాయ నమశ్శివాయ."

ఇత్యాదిగ ముప్పది తొమ్మిది శ్లోకములతో శివస్తవ మొనరించి యా మహాదేవుని సాక్షాత్కారమును బడసి యాతని యనుగ్రహమున దనతోపాటు మలహణికి నామె తల్లికి నామె పెంపుడుఁ జిలుకకుఁగూడ శివలోకప్రాప్తిని సంపాదించి ధన్యుఁడయ్యెను. భక్తిశృంగారములు రెండునుగూడ నీస్తవమునఁ దాండవించు చుండును.

మలహణుఁడు సంస్కృతాంధ్ర కవు లనేకుల సంస్తుతుల కెక్కినాఁడు. ఈతని చరిత్రమును బాల్కురికి సోమనాథుఁడు గూడఁ బండితారాధ్యచరిత్రములోఁ బురాతన ప్రకరణమున సంగ్రహముగ రచించియున్నాఁడు. శ్రీకృష్ణ దేవరాయల కాలమువాఁడగు ఎడపాటి ఎఱ్ఱాప్రగడ దానినే విస్తరించి ప్రబంధముగ రచించినాఁడు. మల్హణుని కాలము క్రీ॥ శ॥ రెండుమూఁడు శతాబ్దుల పూర్వమయి యుండునని యించుమించుగ నిర్ణయింపఁదగును.

౩. మలయరాజీయము:—పూర్వకాలమున మేరుపర్వత దక్షిణ భాగమున మలయదేశమున మలయవతి యనుపట్టణమును దేవరాజను భూవరుండు పాలించుచుండెను. ఆతఁడన్వర్థనామధేయుఁడయి సమగ్రైశ్వర్యమున దేవేంద్రునకు సమానుఁడయి యుండెను. ఆతని భార్యకూడ శచీదేవి నామముకలిగి శచీసమానయై యుండెను. మహావైభవముతో

నా దంపతులు దుఃఖ మన నేమియో యెఱుంగక సకల సౌఖ్యముల ననుభవించిరి. కాని యొక ప్పుడు "అపుత్రస్యగతిర్నాస్తి" "ఏషవా అనృణో యః పుత్రీ" అనుసూక్తులు విని తమకుఁ బుత్రులులేనిగతికిఁ జాలదుఃఖమును జెందిరి. అంత శివానుగ్రహము లేక పుత్రప్రాప్తి కలుగదని భావించి రాజ్యభారమును మంత్రులపై నుంచి యా రాజచంద్రుఁడు నాతని సతియు పురోపకంఠమున శివాలయమును నిర్మించి శివలింగమును స్థాపించి పరమేశ్వర సాక్షా త్కార మగు దనుక వినిశ్చల భక్తితోఁ దపమాచరించిరి. వారితపమునకు మెచ్చి శంకరుఁడు ప్రత్యక్షమయి వారిసంస్తుతుల కానందించి నూరేండ్లు జీవించు దుర్వినీతునిఁగాని, పదు నారేండ్లు మాత్రము జీవించు సువినీతునిఁగాని పుత్రునిగాఁ గోరుకొండని యాదేశించెను. అందుపయి వారు రెండవ పక్షమునే యభిలషించి వరమును బడసి పురమున కేతెంచిరి. అంత వారికీశ్వరానుగ్రహమునఁ బుత్రుఁడుదయించె నా బాలునకు మలయరాజని పేరిడిరి. ఆ కుమారుఁడు విద్యావినయసంపన్నుఁడై దినదినాభివృద్ధిని జెందెను. ఆతని కొకదినము తక్కువగఁ బదునారవ యేడు నిండునప్పటికిఁ దలిదండ్రులాతనికి మరణ మాసన్న మయిన దని మిగుల విలపింపఁ దొడఁగిరి. వారి దుఃఖకారణమును విని మలయరాజు తానున్వయ ముగ నిత్యానిత్యవివేకజ్ఞానము కలవాఁడయ్యును జనకుల విచారము నివారింప నెంచి, మృత్యుంజయ సేవనమునఁ గాని మృత్యువును జయింపరాదని భావించి స్థిరచిత్తముతో మృత్యుంజయ సన్నిధిని నిలిచి డెబ్బదిరెండు శ్లోకములతో నీ స్తవరాజమును రచించి యా మహాదేవు ననుగ్రహమున దీర్ఘాయుష్మంతుఁడయి వర్ధిల్లెను.

ఇది యించుమించుగ మార్కండేయుని కథనుబోలి యున్నది. ఈశ్వరభక్తిచే సాధింపరాని దేమియు నుండనేరదు గదా! మలయరాజు కాలము నిర్ణయింపఁదగు నాధారములు మృగ్యములు. అందుచే నీస్తవ మెప్పుడు రచింపఁ బడినది సరిగా నిర్ణయింపఁ జాలము. ఈస్తవములో నొకశ్లోకములో శ్వేతునికథ యుల్లేఖింపఁ బడినది. ధూర్జటి కాళ హస్తీశ్వరశతక మందలి,

"పవి పుష్పంబగు నగ్నిమంచగు నకూపారంబు భూమిస్థలం
బవు శత్రుం డతి మిత్రుఁడౌ విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలి లోపలన్ శివశివే త్యాభాషణోల్లాసికిన్
శివ నీ నామమె సర్వవశ్యకరమౌ శ్రీకాళహస్తీశ్వరా.

అను పద్యము మలయరాజీయ స్తవమందలి యీ క్రింది శ్లోకమున కనువాదమే యని పాఠకు లెఱుంగుదురు గాక.

"కులిశం కుసుమతి దహనస్తు హిమతి వారాంనిధి ర్ధ్రువం స్థలతి
శత్రుర్మిత్రతి విషమ ప్యమృతతి శివశివేతి ప్రలపతో భక్త్యా!"

4. అనామయ స్తవము:—అనామయ (ఆరోగ్య) ప్రాప్తికై రచింపఁబడిన స్తవమగుటచే దీని కీ పేరు గలిగినది. దీనిని రచించినవాఁడు "కవిర్దండీ కవిర్దండీ" "దండినః

పదలాలిత్యం" అను ప్రశస్తికిఁ బాత్రమయిన దండిమహాకవి. ఇతఁడు కావ్యాదర్శము అవంతి సుందరికథ, అవంతి సుందరీ కథాసారము, ద్విసంధానకావ్యము మున్నగు కృతుల రచించి యశముగన్న వాఁడు. క్రీ. శ. 650 ప్రాంతమునఁ గాంచీపురమುననుండి పల్లవరాజ్యమును బరిపాలించిన మొదటి నృసింహవర్మ యాస్థానము నలంకరించినవాఁడు. ఇతనికిఁబూర్వజన్మ కర్మానుగుణముగ నొకప్పుడు కుష్ఠవ్యాధి కలిగి శరీరమున వ్యాపించి పీడింప దొడఁగెను. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను సూక్తి చొప్పున నీతఁడు సూర్యుని నారాధించియు నారోగ్యమును గాంచనేరక శివసంస్మరణముననే దానిని సాధింపఁ దగునని తలంచి ముప్పదియొక్క శ్లోకములతో నీ యనామయ స్తవమును రచించి యీశ్వర సాక్షాత్కారమును బడసి యారోగ్యమును బొందెను. ఆరోగ్యము నర్థించువారి కిది యవశ్య పఠనీయము. ఈ స్తవమందలి యంతిమ శ్లోకమును జూడుఁడు.

"ఇతి విరచితమేత చ్చారుచంద్రార్ధమౌళే, ర్లలిత పద ముదారం దండినా పండితేన
స్తవన మవనకామే నాత్మనోఽనామయాఖ్యం, భవతి విగతరోగో జంతు రేతజ్జపేన."

5. హలాయుధ స్తవము:—హలాయుధుఁడు వీరశైవాచారపరాయణుఁ డగు రాజసత్తముఁడు. ఈ సంస్తవ రచనము వలన నాతఁడు శివుని ప్రత్యక్ష మొనరించి యాతని యనుగ్రహమునఁ దొమ్మిది గ్రామముల ప్రజలతో గూడ శివలోకమున కేగెనని తెలియుచున్నది. ఇందు 66 శ్లోకములు గలవు.

"ద్విజో దక్షిణ రాష్ట్రీయో నవగ్రామవినిర్గతః,
హలాయుధబుధశ్శంభో రిమాంస్తుతిమజిగ్రథత్"

అను నీ స్తవమందలి కడపటి శ్లోకము కూడ నీ యైతిహ్యమునకుఁ గొంత స్ఫోరకము కాఁగలదు. పాలకురికి సోమనాథుని బసవపురాణమున హలాయుధుని కథ కలదు. శివుని పరీక్షకు నిలిచి పుత్త్రునిఁ జంపి యాతని మాంసమును వండిపెట్టునపుడు చిఱుతొండనంబి (సిరియాళుఁడు) యీశ్వర సాక్షాత్కారమును గాంచి, కంచి యేడు వాడలతో వారితోఁ గూడ శివలోకప్రాప్తిని బొందిన తరువాతఁ దనంతటి భక్తుడు లేడని యొకనాడు గర్వోక్తులు పలుకగా నాతని గర్వనిర్వాపణార్థము శివుఁడు జంగమరూప ధారియై సిరియాళుని వెంట నిడుకొని భూలోకమున కేఁగి నిమ్మవ్వ మున్నగు భక్తజనంబుల భక్తి నాతనికి జూపి హలాయుధుని కడకుఁ గూడ జనుదెంచెను. సిరియాళ కథా వృత్తాంతముల నా జంగమాని వలన విని యేవగించుకొని హలాయుధుఁడు కినుకఁ బొంది భక్తుని మాంసమును వాంఛించి తన్మూలమున జంగమవధకుఁ గారణమయిన యకార్య కరణమునకు శివుని తన శరీరమును మిగిల్చికొని పుత్త్రుని జంపి యారూపమున జంగమ హత్య యాచరించిన ఘోరకృత్యమునకు సిరియాళుని నిరువురను గూడ శైవప్రపంచము నుండి వెలివెట్టితినని ప్రకటించును. అప్పుడు పార్వతియు, సిరియాళుని భార్య సంగళవ్వయు

భక్తురాండ్రు వేసములతో హాలాయుధుని కడ కేఁగి పతిభిక్షను వేఁడి తమ నాథులను వెలి నుండి విడిపింతురు. అప్పుడు శివుఁడు హాలాయుధునకుఁ బ్రత్యక్షమయి యాతనిని నాతఁడు పాలించు నవపురంబులలోని భక్తతతినిఁగూడఁ దన విమానముల పయి శివలోకమునకు గొంపోవును. అప్పుడే ప్రాయశః హాలాయుధుఁ డీ స్తవము రచించి యుండును.

చిఱుతొండఁడు కాంచీపుర పల్లవరాజులవద్ద సేనానియై క్రీస్తుశకము 630 సంవత్సర ప్రాంతమున నుండె నని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికలో వ్రాసినారు. ఇది సరియగునేని హాలాయుధుఁడు క్రీస్తుశకము 700 ప్రాంతమువాఁడగునని నిర్ణయింపఁ దగును.

ఇప్పటికి నీ శివపంచ స్తవములలో మహిమ్నమే విశేషముగఁ బ్రచారమున నున్నది. తెలుఁగు లిపిలో బృహత్స్తోత్ర రత్నాకరమును ప్రకటించిన వారుగూడ మహిమ్నమునే గాని తక్కినవాని నా గ్రంథమునఁ జేర్చి యుండలేదు. కావున భక్తుల యుపయోగార్థము వానిని బరిశుద్ధముగఁ దెలుఁగు లిపిలోఁ బ్రతిపదార్థముతోఁ బ్రకటించుట యావశ్యకమని హెచ్చరించుచున్నాను. తక్కిన నాలుగు స్తవములను, బిల్హణ స్తవమును, లభింపుచో మయూర స్తవమును (కుష్ఠవ్యాధిహరము) గూడ నీ 'విభూతి' లోఁ జక్కఁగఁ బరిష్కరించి మూలములనైనను సంపాదకులు ప్రకటింతురుగాక యని ప్రార్థించుచున్నాను. *

* శివపరములైన యిట్టి యమూల్య స్తోత్రరత్నములు ఇంకను ననేకములుగ నున్నవి. వీని నన్నిటిని "శివస్తోత్ర మహార్ణవము" అను గొప్ప గ్రంథమున బ్రకటింపవలెనని చిరకాలమునుండి నిరీక్షించుచున్నాము. 'విభూతి' పాఠకులలోని యుదార మహనీయు లెవరైన సాహాయ్యపడుచో కాయకష్టమునకు సంసిద్ధులమని మనవి. వి. సం.

## విద్యార్థులు కావలెను

శ్రీ మటికె నాగయ్యగారి ధర్మ నిలయమందలి గురుకులమున సంస్కృతాభ్యాసమును గావించుటకు కొలదిగా వీరశైవ విద్యార్థులు కావలసియున్నారు. వీదలకు భోజనము, నివాసము ఉచితముగా నుండును. సామాన్యముగా బడి చదువు ముగిసి యుండవలెను. కొంత సంస్కృతము జదువుకొనినవారికి ప్రాధాన్య మీయబడును. వివరములకు 'విభూతి' చిరునామాకు త్వరగా వ్రాయవలెను. వయసు చెల్లినవారును, మంద వాక్కులును జేర్చుకొనబడరు. ఆలస్యముగ జేయువారికి అవకాశముండదు.

## 'విభూతి' కి విశేష వ్యయము

'విభూతి' ముద్రించు కాగితములు విశిష్టమైన తరగతికి చెందియున్నవి. మూడురెట్లు ఎక్కువగా వెలయిచ్చినను, అవి దుర్లభము. రానురాను సామాన్య కాగితమైనను దొరకునా యని సందేహ మగుచున్నది. అనివార్యముగ కాగితములను గూడ తగ్గింపవలసి వచ్చునేమో. మిక్కిలి వ్యయమగుచున్నది. చందాలు పంపనివారును, సహాయము చెల్లింపనివారును చాల త్వరగా తోడ్పడి 'విభూతి'కి విపత్తులురాకుండ జూతురుగాక!

# శ్రీ రేణుకాచార్యోపదేశము

శ్రీ నేమాన సూర్యప్రకాశ కవిరాజుగారు

వ॥ శ్రీమత్పరమేశ్వర లీలావతారమూర్తియగు శ్రీ రేణుకాచార్య చక్రవర్తి నిజమానస పుత్రుండును, నిరుపమాన ప్రతిభావిభాసితుండును నగు, శ్రీమదుద్రమునిదేవు నవలోకించి.

చ॥ అన్న! కుమార! నీవు విమలాత్ముడవైతివి విద్యలన్నియుం
గ్రన్నన నేర్చినాడ వవికల్ప మనల్ప మఖండమై కడుం
జెన్నగు తత్త్వ వైభవ విశేషము నీ కుపదేశ మిచ్చి యీ
యున్నత పీఠరాజమున నుంచ మనంబున నిశ్చయించితిన్.

గీ॥ కాన నీవు సావధాన మనస్కుండ,వగుచు నాలకింపు మనుడు గురుని
పలుకులకు నతండు ప్రచుర ప్రమోద సం,కలిత హృదయు డగుచు గౌరవమున.

గీ॥ వినయ వినతోత్తమాంగుడై వినతినల్పి, దేవ తత్త్వార్థముల నుపదేశ మొసగి
ననుఁ గృతార్థుని గావించి మనుపు మనుడు, నెలమి నాచార్యు డాతని కిట్లులనియె.

సీ. అఖిలాగమంబులయందు గాయత్రియు, సకల మహామంత్ర సముదయమున
శ్రీ శివపంచాక్షరీమంత్రరాజంబు, సర్వదైవములందు శంకరుండు
శక్తి బృందమునందు శైలనందనయును, వందనీయులయం దమంద తత్త్వ
సారజ్ఞుడైన యాచార్యవర్యుండును, బరమోత్తమత్వంబు బడసి నిఖిల
భువనములయందు దేవదానవ మనుష్య,వితతిచే సంతతంబు సేవింపబడుచు
నెసగుచుండు నీ పరమార్థ మీవు దొలుత, రూఢినెఱుగుము మృదుభావ రుద్రదేవ.

గీ॥ విమల లింగాంగతత్త్వ ప్రవీణు, నఖిల సంశయచ్ఛేదన సమర్థు స్వగురువంశ
జాతు, సిద్ధాంత తంత్ర విశారదు గురు, వర్యునిగ ముందుగైకొనవలయుఁ బుత్ర.

గీ॥ సకల జగము లెందు సంభవించు జరించు, విలయ మొందునదియె విమలతత్త్వ
మదియె నిత్యసచ్చిదానందమయము బ్రహ్మంబు పరమలింగ మది కుమార.

గీ॥ కడగి కామాది శత్రుషట్కంబు గెలిచి, పరము సచ్చిత్స్వరూపు నీశ్వరు నెఱింగి
లోకహితకారియగుచు వెలుంగు నతడు, పరమ జంగంబు గురుపట్టభద్రుడు సుత.

ఉ॥ సారమతిం దలంప గురుచంద్రుడు జ్ఞానసుధాపయోధి సం
సార మహోగ్రరోగభయ సంహార ణౌషధ మిద్ధసచ్చిదా

కారుఁడు, భర్గభక్తిభరగమ్యుఁ డజాచ్యుత శంకరాత్మక
స్ఫారుఁడు, తత్పదాంబు వతిపావనమంచు నెఱుంగు మాత్మజా.

మ॥ పరికింపన్ గురుఁ డిష్టదైవము పరబ్రహ్మంబజోపేంద్రశం
కర శక్రార్క శశాంకముఖ్య సురవర్గం బాత్మయుం బ్రాణమున్
గురువే సుమ్ము శ్రుతుల్ స్మృతుల్ గృతులు వల్కున్ నాస్తి తత్త్వం గురోః
పరమం బిద్విధ మీవు నిచ్చలు మదిం బాటింపుమీ పుత్రికా!

మ॥ పొలుపార న్మను పద్మజాదులు గురుం బూజించియే సత్పద
స్థులు సంపూజ్యులు సుప్రభావయుతులై సొంపొంది రేతద్గురూ
జ్జ్వల కారుణ్యకటాక్ష వీక్షణములే సంసార సంతాపముం
దొలగంజేసి కృతార్థు నున్నతపదస్థుం జేయు భక్తు న్సుతా!

వ॥ అని యెఱింగించి వెండియు నిట్లనియె.

మ॥ హర దేహాభరణ స్వరూపము రమేశాబ్జాసనేంద్రాది ని
ర్జరసందోహమనోహరావయవధార్యం బుల్లసద్గోమయో
త్కరసంభూతము శ్రీకరం బతిపవిత్రంబైన భస్మంబు సు
స్థిరుఁడై భక్తుఁడు దాల్పఁగావలయు నిర్దిష్టాంగ భాగంబులన్.

చ॥ హరునకు గల్గెఁ గంటఁద్రిపురాసుర సంహరణంబువేళ ని
ర్భర పరితోషసంజనిత బాష్పకణం బది భూతలంబునం
దొరగి మహామహీజమయి తోడనె వృద్ధివహించి మించె భా
స్వరనవపల్లవ ప్రసవపక్వఫలాన్వితమై సమున్నతిన్.

మ॥ అది రుద్రాక్షమహీరుహం బను సమాఖ్యం జెంది లోకోత్కరా
భ్యుదయాపాదకమై సురాసుర నరవ్యూహస్తుతి ప్రక్రియా
స్పదమై యొప్పె దదీయపక్వఫలబీజం బుర్వి రుద్రాక్షమై
పొదలెన్ దాని ధరింపగావలయు శైవుం డాదృతిం బుత్రికా!

సీ. వినుమయ్య సానందుఁ డను నొకగణవరుం, డొకసమయమున బ్రాహ్మోగ్రశమన
నగరుఁడై నిశ్శేషనిగమసారంబగుఁ, బంచాక్షరీమంత్రపఠనమహిమ
మున ముక్తనరకుఁడై తన దివ్యపదమొంది, యఖిలసౌఖ్యంబుల ననుభవించె
నంతియకాదు విశ్వామిత్రుఁడాదిగాఁ, గల మహామౌనిపుంగవులు దొల్లి
పడసి రీ దివ్యమంత్రజప ప్రభావ, విభవమున నున్నతపదంబు లభిమతార్థ
సిద్ధులును గానలే దీ ప్రసిద్ధ మంత్ర, మునకు, నెనయైన మంత్ర మెందున గుమార.

సీ॥ సకల చరాచరాత్మకములైన జగంబు, లల శివాధీనంబులై యెసంగు
నా శివుండసమ పంచాక్షరీ దివ్యమ,హామంత్రి సంగతుండై వెలుంగు
నమ్మహాదివ్యమంత్రాధిరాజంబు దా,నెపుడు సద్గురు నాశ్రియించియుండు
నగ్గురూత్తముడు శివాద్వైతవి,ద్యారహస్యార్థ సంపూర్ణుడై చెలంగు
నట్టి పరమశాంతు నతినిర్మలస్వాంతు, నతికృపానిశాంతు నధికదాంతు
సద్గురు ప్రవరుని సర్వోత్తమునిగాగ, మది గణింపుచుండుమా కుమార.

ఉ. అంచితభక్తి బాణితలమందు ధరించిన శర్వలింగమ
ర్చించుచు తత్ప్రసాదమును జెంది మహేశ్వర తత్వమాత్మ భా
వించుచుఁ దద్విధంబు వినిపించుచు భక్తులకెల్ల చోట్ల వ
ర్తించు నతండు శైవమత దేశికుడై విలసిల్లుఁ బుత్రికా!

సీ॥ ఎవ్వడు కరమున నీశ్వరలింగంబు, స్థాపించుకొని యుపాసనమొనర్చి
దాని భుజాంతరస్థలి భక్తిమై ధరి,యించుచుండునో యతం డిష్టలింగి
యనబడు నెవ్వండు మనమున శివలింగ,మును స్మరియించుచుండునో యతండు
ప్రాణలింగి యనంగబడు నెవ్వడెవ్వేళ, శివమయత్వంబుఁ దాజెంది ప్రీతి
బడయుచుండునో యాతండు భావలింగి, యనబడునటంచు సర్వశైవాగమములు
పలుకుచున్నవి నీవు తత్పద్ధతులను, దెలిసి వర్తింపుమో రుద్రదేవ! వత్స!

మ॥ తతసంసారవిరాగి గొల్వదగు నిత్యం బిష్టలింగంబు న
ద్భుత భోగాభిరతుండు గొల్వదగు నెప్డుం బ్రాణలింగంబు నా
తత కైవల్యఫలార్థి గొల్వదగు నుద్యద్భావలింగంబు నీ
గతుల న్మూడిట భావలింగరతి ముఖ్యం బేరికి న్నందనా!

సీ॥ క్షాంత్యంబుపూరంబు స్నానంబుగాగ వి,వేకంబు మృదువస్త్ర వితతిగాగ
సత్యోక్తి రత్నభూషావిశేషముగాగ, వైరాగ్య మురుసుమప్రజముగాగ
బ్రవిమల హృదయంబు పరమగంధముగాగ, దాంతి విశుద్ధాక్షతములుగాగ
ననుపమ విశ్వాస మగరుధూపముగాగ, బ్రిజ్ఞాన రమ ప్రదీపంబుగాగ
ఘన మనోదార్ఢ్య మఖిలాన్న కలనగాగ, బ్రణతిసంతతి వీటికాపటలి గాగ,
బరశివారాధనంబు సద్భక్తి జేతు, రలఘులింగాంగులైన భక్తులు కుమార. *

---

* అస్మద్దేవిడీ సంస్థాన రాజాజ్ఞానుసరణముగ నా చే రచియింపబడిన ఈ రేణుకాచార్య చరిత్రము శ్రీ వారు కృతి స్వీకారమొనర్చి ముద్రింపించిన వెనుక శివభక్తబృందమును సందర్శించి యానంద మొందించుగాత.

# భవభూతి: రసికతా ప్రేమములు

శ్రీ వేదాంత శిరోమణి కంచిభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

అనంత ప్రకృతికి ప్రపంచము నానందపరచు చిత్కళాశక్తు లనంతములు. కళ యన సోపాధికభావనాలబ్ధ హ్లాదైకమయానంద విశేషము. ఆనందము లేనిది జగత్తు జీవించదు. ఆనందమునకై అఖండ విశ్వము అంతులేని జీవిత విప్లవముల సహించును. ప్రసభసుభగానందావాప్తికై ప్రపంచము పరమ తపము జేయును. నిరుపాధికభావనాలబ్ధ హ్లాదైకమయానంద విశేషము రసము. తృప్తిహేతుభూతానందకర చైతన్యవిశేషమే రసమని శంకరుడు. ఇది స్వపర భేదాతీతమై బ్రహ్మానంద సబ్రహ్మచారి యగుచున్నది. విశ్వహృదయాహ్లాదైకమయానిర్వచనీయానందము భోజ్యావస్థయందు కళ యనియు భోజ్యభోజకోభయాతీతావస్థయందు రసమనియు వ్యవహరింపబడుచున్నది. రసము నిర్వికల్పకము. కళ స్వకల్పకము. కళ హృదయానందశక్తుల రేకెత్తించ భావుకు డా ప్రకృతికళాతీతుడై రసస్వరూపు డగును. సవికల్పసమాధియందు భావుకుడు భావమును విమర్శించి యనుభవమున నెట్లు నిర్వికల్పసమాధిస్థు డగునో యట్లె కళోపాసకుడును రసస్వరూపు డగు ననుట సమ్మతమగు మాట. ఈ కళ యనునది ప్రకృతి గర్భమున వెలసి ధ్వనిసుధాస్రవంతిని లీనమై రీత్యలంకారాదుల కూలముల నొరయుచు, రసజీవితమై శబ్దమయప్రపంచము నానందమయముగ జేయుచున్నది. కళ యందు క్రియాశక్తి క్రీడించుచుండును. రసము నందు జీవనశక్తి జీవించుచుండును. కళ ప్రకృతికి నవనవోన్మేష నాగరికత నిచ్చును. రసము ప్రకృతికి ప్రాణము నిచ్చును. కళ భాషకు చక్కిలిగింతవంటిది. రసికుని రచనల యందు ఇదమిత్థమని నిర్ణయమునకు రాని ప్రకృత్యతీతానిర్వాచ్యావేదనాస్రవంతులు పొంగి పొరలుచుండగలవు. కళోపాసకుని రచనలయందు ప్రకృతిని దాటని భావపుంజములు భాసిల్లుచుండగలవు. రసికుడు కళారాధకుడు గావచ్చును గాని కళారాధకుడు రసికుడగుటకు కొంత యనుభవ ముండవలెను. ప్రథమమున సవికల్పసమాధియందు ప్రకృతిని విమర్శించి తత్త్వమందక యేదో నొక నిర్ణయమునకు రాని నిర్వికల్పకుడై "కిమపి కిమపి" యని యేవో యనిర్వచనీయ గీతముల బాడుచుండును. కళారాధకుడు ప్రకృతిని పరామర్శించి ఒక సిర్ణయమునకు వచ్చి భావగీతముల నాలాపించుచుండును. కాళిదాసు కళారాధకుడు. భవభూతి రసికుడు.

కనుకనే భవభూతి రచనలు ఇదమిత్థమని నిర్ణయమునకు రాని 'కిమపి కిమపి' యను భావముల ముద్దు బెట్టుకొనుచున్నవి. చూ.

"కిమపి కిమపి మందం మంద మాసక్తి యోగా
దవిరళితకపోలం జల్పతో రక్రమేణ"

“ పరిచ్ఛేదాతీతః సకలకరణానా మవిషయః
పునర్జన్మ న్యస్మిన్ అనుభవపదం యో న గతవాౕ
వివేకప్రిధ్వంసా దవిదితమహామోహాగహనః
వికారః కోప్యన్త్యః జటయతి చ తాపం చ తనుతే ”

“వ్యతిషజతి పదార్థా నాంతరః కోఽపి హేతుః” ఇత్యాదులు. మరియు తనవలెనె భవభూతి తన నాటకముల యందలి పాత్రిలను గూడ చైతన్యశూన్యములనుగా జేయు చుండును. కనుకనే ఇతరుల నాటకముల కంటె ఇతని నాటకములందు పాత్రిలు మూర్ఛ జెందుట జాస్తి. మూర్ఛాధిక్యత గల నాటకములు ముందుకు రాలేవు.

ఒక విషయము నభినయించు పాత్రి యంకమధ్యమున మూర్ఛజెందిన కథ చంపి నట్లగుటచే, తరువాత కథా వస్తువునందు జాస్తి యుత్సాహము సామాజకుల కుండక పోవుటయే దీనికి ముఖ్యకారణము. శాకున్తలమునే గనుక భవభూతి వ్రాసియుండిన పంచ మాంకమున శకుంతలను, ఆరవ యంకమున దుష్యన్తుని ఏవెయ్యిసార్లో మూర్ఛ నొందిం చెడివాడు. కాళిదాసు కళాభిజ్ఞుఁడు, కనుకనే తనవలె పాత్రిలనుగూడ ప్రికృతిని దాటనీయ లేదు. కళారాధకుని కవిత్వము విశ్వమున కందినట్లు రసికుని కవిత్వ మంత త్వరలో నందదు. రసికుని రచనలు పండిత పామరోభయ సంవేద్యములుగావు. విజ్ఞుడగు పండితుఁడు మాత్రిము విని యానందించును. కళారాధకుని రచనలు పండిత పామరోభయారాధక ములు. కళారాధకుని కమనీయ కావ్యవిన్యాసము కొంగ్రొత్తయై విశ్వమానవ హృదయ ములకు చక్కలిగింత కలుగజేయును గనుకనే కాళిదాస కావ్యకళావిన్యాసమున కంతటి విలువ వచ్చినది. భవభూతికంటె కాళిదాసునకు ఉపమానరచనాపటిమ మిక్కిలి యగు టకు కారణము కాళిదాసు కళారాధకు డగుటయె. కళోపాసకుఁడు ప్రికృత్యతీతుడు కాక పోవుటచే ప్రికృత్యంతర్గతోపమానాదుల చిత్రించగలుగుట. రసికుఁడు ప్రికృత్యతీతుడుగాన అతని కుపమానాదు లంత పరిపాటిగా నందవు. కాని రసికుని హృదయము నవనీతము వం టిది. అదియొక కిన్నెరవీణ. దాని కేమాత్రిము ప్రికృతిసంబంధము సోకినను అది ద్రివీ భూతమై యమృతభావముల నాలాపన జేయుచుండును. ఆ దివ్యస్వరజగత్తున యద్వైత మారోహణావరోహణ క్రిమము నొందుచుండును. ఆ రసికుడగు భవభూతిగీతములలో నేదొయొక జన్మాన్తర సంస్కృతి తట్టి లేపబడిన ట్లుండును. ఆ రసికుని రచనలందు అనుభూతి లేని యమృత రసకుల్యములు జలజల జారుచున్న ట్లుండును. ఒక్కొక్కతరి యా గీతములకు హృదయము అంగారచుంబితమువలె వ్యధమాన మగుచుండును. ఆనందరసమున నంతు దెలియక నుబ్బితబ్బిబ్బులై ఒడలు దెలియక పాడు శృంగారగీతములలోను, కఠిన గండశైల ములనుగూడ భోరని యేడ్పించు కరుణ గీతములందును, కరకుకటారుల ఝుళిపించుచు కదన రంగమున దిరుగు రణవీరుల వీరగీతమందును, రసికున కాత్మనిర్వృతియొకటే గాని భిన్నము గాదు. ఈ యనిర్వచనీయ రచనాపద్ధతి యుపనిషత్కాలము నాఁటిదైనను, వ్యాస వాల్మీ

కుల కాలమందు వ్యాప్తి జెంది, బౌద్ధకాలము నాటికి బుద్ధిస్థమై శంకరుని కాలమున సిద్ధాంతీకరింపబడి భవభూతి కాలమునాటికి దృశ్యప్రబంధ వ్యాప్తమైనది. ఈ యనిర్వచనీయ భావగుంభిత రచనలకు భవభూతి మార్గదర్శకుఁడు. మరల రచనాపద్ధతిలో నీతని త్రోవ ద్రొక్కినవా డార్యక్షేమేశ్వరు డొక్కడే. చూ: ఇతడు తన చండకౌశికమందు—

"సుఖం వా దుఃఖం వా కిమివహి జగత్యస్తి నియతం
వివేకప్రధ్వంసాద్భవతి సుఖదుఃఖవ్యతికరః
మనోవృత్తిః పుంసాం జగతి జయినీ కాపి మహతాం
యయా దుఃఖం దుఃఖం సుఖమపి సుఖం వా నభవతి"
యని వ్రాసినాడు.

భవభూతి యొక్క అసలు పేరు శ్రీకంఠుడు. ముక్కుతిమ్మన్నకువలె ఇతని కీపే రాగంతుకము.

"తపస్వీకాం గతోఽవస్థా మితి స్మేరముఖాననా
గిరిజాయాస్తనౌ వన్దే భవభూతిసితాననా"

"సాంబా పునాతు భవభూతి పవిత్రమూర్తిః" యని తన యంబికా స్తోత్రమందు "భవభూతి" యని విచిత్రప్రయోగమును జేయుటచేత ఇతని కీ భవభూతి యని పేరువచ్చిన దండ్రు. తంత్రవార్తికమందు "యే నామ కేచిదిహ నః ప్రథయన్త్యవజ్ఞా"మ్మను శ్లోకముండుటచేతను, "ఒకానొకమాలతీమాధవ" మాతృకయందు "ఇతి శ్రీ కుమారిల భట్టపాదవిరచితే మాలతీమాధవే తృతీయోంకః......యని యుండుటచేతను, ఇతడే కుమారిల భట్టనియు," బౌద్ధగ్రంథమందు

భట్టపాదస్తు విఖ్యాతః కుమారేతి వినిశ్రుతః
తైత్తిరీయో వృత్తికారః మీమాంసాతంత్రపాలకః......
...గురుద్రోహ మహాపాపీ ఆంధ్రదేశీయ ఏవచ......"

యని యుండుటవలన ఇత డాంధ్రుడనియు ప్రతీతిగలదు. కాశ్మీర దేశమునందు లభించిన మాలతీ మాధవ మాతృకయందు "ఇతి శ్రీ మీమాంసాచార్య ఉంవేకకృతే మాలతీ మాధవే సప్తమోంకః" యని యున్నందున యిత డుంవేకుడనియు, మాధవాచార్యులు తన శంకర విజయమందు "ఉంవేక ఇత్యభిహితేన" యను శ్లోకమం దుంవేకుఁడే మండనమిశ్ర డని చెప్పినందున ఇతడు మండనమిశ్రుడనియు చెప్పుదురు. ఇతడు మాలతీ మాధవము, ఉత్తరరామచరితము, మహావీర చరిత మను దృశ్యప్రబంధత్రయమును రచించెనే గాని శ్రవ్యప్రబంధముల రచించలేదు. విని కవీశ్వరునిభావముల గ్రహించుట కంటె, కని యానందించుటయం దతిశయమున్నది. మరియు దృశ్యము పండితపామరోభయ రంజకము. కనుకనే భవభూతి తన నూత్న భావప్రచారముల దృశ్యప్రబంధరీతిలో ప్రపంచమునకు పంచిపెట్టెను. కాని భవభూతి దృశ్యప్రబంధరచనల వదలి శ్రవ్యప్రబంధముల రచియించియుండిన బాగుండెడిది.

భవభూతి తరుచు కాళిదాసకవిత నాదరించుచు యతని కళాసృష్టికి జీవమును బోసినాడు. కాళిదాస భావములన్నిటిని లాగి అందు పొంగి పొరలు భావానందసుధాబ్ధిని అగస్త్యునివలె నరచేతిలోనికి బట్టినాడు. చూ: మాలతీమాధవము తొమ్మిదవ యంకమును, అందు.

"కచ్చిత్సౌమ్య ప్రియసహచరీ విద్యుదాలింగతి త్వాం
ఆవిర్భూత ప్రణయసుభగాః చాతకా వా భజన్తే
పౌరస్త్యోవా సుఖయతి మరుత్సాధుసంవాహనాని
విష్వగ్విభ్రత్ సురపతిధనుర్లక్ష్మ లక్ష్మీం తనోతి"

మరియు

దైవాత్పశ్యేః జగతి విచరన్ మత్ప్రియాం మాలతీం చేత్
ఆశ్వాస్యాదా తదనుకథయేః మాధవీయా మవస్థాం
ఆశాతన్తు ర్నచ కథయతాత్యంతముచ్ఛేదనీయః
ప్రాణత్రాణం కథమపి కరోత్యాయతాక్ష్యా స్స ఏకః"

యని మందాక్రాన్తవృత్తములోనే మైమరపించి మేఘసందేశమునకు మెరుగు పెట్టినాడు. ఇతడు కవితను వ్రాయునపుడు మైమరచి లక్షణమర్యాదనుగూడ అతిక్రమించుట కలదు.

భవభూతి యెప్పుడును విశ్వసృష్టిని విమర్శించుచుండును. ఈ సృష్టిలో నేదో రహస్యమున్నది. శంపాలత యెంత చంచలమైనది!! మరియు నెంత యందగత్తె!! పాప మా పిల్ల తగు వరుడు లేకగాబోలు కఠోర గంభీర ఘోషలతో నురిమిచూచు నీలమేఘుని కౌగిళ్ళ సౌభాగ్యమును కాంక్షించుట! పాపము గంధఫలి యేమి పాపముం జేసినది. భౌతిక సృష్టిలోనిది వరక నుడిగల పిల్ల. ఎంతటి పరాక్రమశాలియైనను భ్రమరరాజు దీని సౌందర్యమును జవిచూచెనా; వెంటనే పరలోకయాత్ర జెప్పవలసినదియే. అయిన గంధఫలి యౌవనము కాలపురుషుని కఠోరవీక్షణములో కమిలిపోవలసినదేనా? మగనితో ముచ్చటలాడు ఆ ముద్దుగులాబికి ప్రక్కన ముండ్లబాధ యెందులకు? ఏ బాధయు లేని మోదుగను మాచకమ్మనుగా జేయు టెందులకు? అబ్బ!! ఎందులకా పుండరీకమట్లు పకపక విరుగబడినవ్వుట? ఓహో తన యుదయ సూర్యుడరుదెంచుచున్నాడని గాబోలు యా మిడిసిపాటు. ఎప్పుడు శుక్లపక్షమె యుండరాదు? మరల నీ పాపిష్ఠి కృష్ణపక్షమెందులకు? చందమామనుజూచిన కలువరాణి కానందమెంచుకు? ఎప్పుడును ఆనందమే అఖండరూపములో వెలుగుచుండగూడదు! మరల దుర్భరకష్టపరంపర లెందులకు? ఏమో యీ సృష్టిలో నేమున్నదో నెవ్వడెరుగగలడు?

మన భవభూతి ప్రపంచమంతయు నానందమయ మనియు, మానసికవృత్తు లుండునంతకాల మీసృష్టి ద్వన్ద్వోపహతమనియు, ప్రతిమానవుడును పవిత్రమై అఖండమై అమే

యమై యనిర్వచనీయమై చమత్కారజనకమై వెలుగు పరంజ్యోతీరూపమగు ఆనందమును పొందుటకు యీజగత్తును ప్రేమించుననియు, పవిత్రమగు ప్రేమయే ప్రాణధారణకు హేతువనియు, ప్రేమావాప్తికై జగత్తు తన జీవితజ్యోతి నారకుండ కాపాడుకొనుననియు, దుఃఖముండిననే గాని సుఖమునం దుండు నతిశయానందము తెలియదనియు, ప్రేమ యనగా అఖిల ప్రకృతికప్రపంచహృదయము నాకర్షించు యాంతరికానిర్వాచ్యహేతుజనితానందమయ చమత్కారజనక చిచ్ఛక్తివిశేషమనియు, అనగా యాత్మతృప్తిహేతు భూతమై ఆనందమును గలుగజేయు వస్తువిశేషమే ప్రేమయనియు, తన మాలతీమాధవోత్తరరామచరితముల మూలకముగా వెల్లడించెను. కనుకనే దీని నాలంకారికులు బ్రహ్మానంద సబ్రహ్మచారి యనెదరు. ఈ ప్రేమగలుగు కారణ మిదమిత్థమని నిర్ణయింప రానిది. ఇది సుఖమునందేగాదు, దుఃఖమునందును పొంగి పొరలుచుండును. ఇది తన వనిత యందేగాదు, తల్లియందుగూడ తాండవించుచుండును. ఇది యమృతమునం దెంతో విషమునం దంత. కాని దీనిని గ్రహించుటయందు గ్రాహకసామగ్రి ననుసరించి గ్రాహ్యము గ్రాహకసామగ్రి గ్రస్తమై నానావిధ నామములతో భాసిల్లుచుండును.

భవభూతి ప్రేమహేతుజిజ్ఞాసువై ప్రేమయొక్క బాహ్యాభ్యన్తర హేతుతత్త్వమును విమర్శించి నిర్ణయించలేక ప్రేమతత్త్వ గీతము నొకదానిని పాడినాడు. చూ:

"వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః
నఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రయన్తే
వికసతి హి పతంగస్యోదయే పుండరీకం
ద్రవతిచ హిమరశ్మా వుద్గతే చంద్రకాంతః."

చల్లని చూపులతో చూచుచు చల్లని చేతుల జాచి మృదు మధురాలింగనముల యాచించు హిమరశ్మిని జూడగనే మూతిముడిచి ఉషాదేవితో నుయ్యాల లూగుచు నైన్ద్రియం దనురాగముగలిగి నాటలాడుచు వచ్చు నుదయసూర్యునిగాంచి పుండరీకము పకపక నవ్వుచున్నది. చంద్రునికంటె చక్కనివాడని యా సూర్యుని యా పుండరీకము ప్రేమించుట చంద్రకాంత గ్రావములు చందమామ తమ మేనమామ కొడుకనియా అవి అతనిని జూడగనె యానందబాష్పముల వదలుట? కాని యేలనో ఇట్లు బాహ్యావస్తువులు పరస్పర ప్రేమబద్ధములైనవి. ఈ ప్రేమ జాతిమత కులరూపశీల ధనవిద్యావిచక్షణలేకయే మనస్సుల గలుపుచుండును. కాని యేకారణములేక ఆ వ్యక్తినే మరియొకవ్యక్తి ప్రేమించుట కేమికారణము? కారణములేనిది కార్యము బుట్టదుగదా? ఈ ప్రేమరూపకార్యము గలుగుటకు కారణమేమి? అసలు ప్రేమగలుగుట కేదైన కారణమున్నదా?

ఉన్నది కాని అది ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలులేదని భవభూతి పూర్వజన్మసంస్కారమే ఒక వ్యక్తిని మరియొకవ్యక్తి ప్రేమించుటకు హేతువని కళారాధకు డగు కాళిదాసు ("భావస్థిరాణి జననాంతర సౌహృదాని. శాకుం") అనిర్వచనీయ మానసిక

ప్రవృత్తియె హేతువని యార్యక్షేమేంద్రుడు (మనోవృత్తిః పుంసాం జగతి జయినీకాపి మహతాం" చండ.) మనోదార్బల్యమే తుచ్ఛవస్తువిషయక ప్రేమగలుగుటకు కారణ మని యశ్వఘోషుడు. అనగా బుద్ధికి బ్రహ్మచర్యము లేకపోవుటయె మానసిక వృత్త్యుత్పత్తికి హేతువని తాత్పర్యము. ప్రేమ ప్రవృత్తి కీశ్వరేచ్ఛయే కారణమని తార్కికులు. ఈ యిచ్ఛ గలుగుటకు విలక్షణ కారణ మొకటి యుండగూడదా యని పూర్వపక్షము. జేసియు దానిని ఖండించి ప్రవృత్తికి నీశ్వరేచ్ఛయే కారణమని సాధించినారు. చూడుడు.

"కర్తృధర్మేణ కేనచిత్ ప్రవృత్తిహేతునా భవితవ్య మితి చేత్ అస్త్విచ్ఛా ప్రత్యక్షసిద్ధా, నతు జ్ఞానం. సైవ కథం నియతాధికరణే ఉత్పద్యతామితి చేన్నైవం కారణాంతరాభ్యుపగమేపి తుల్యత్వాత్ స్వహేతోః కుతశ్చిదితి చేత్ తత ఏవ ఇచ్ఛా అస్తు కిం కారణాన్తరకల్పనయా......ఇచ్ఛాయాః కారణం విలక్షణమేవ కల్పనీయం తథాచ కాలాత్యయాపదిష్టోహేతుః (న్యాయ కుసుమాంజలి 4, స్త. 4, కారికా వృత్తి) అని. వాత్స్యాయనుడు ఒక స్త్రీని ప్రేమించుటకు కారణములు సౌందర్యము, సంగీతము, విద్య, ఐశ్వర్యము, కళాకోవిదత్వము, సాకూతభాషణ ప్రవీణత, అట్లు గానియెడల జప తప మంత్ర యంత్రములనియు సూత్రించినాడు. కాని వాత్స్యాయనుడును ప్రేమ హేతువులో భవభూతి ననుసరించినాడు. బాణకవి భవభూతి ననుసరించినాడు. షేక్స్పియర్ Love's Labours Lost లో ప్రేమ సిద్ధాన్తములో భవభూతి ననుసరించినాడు. Twelfth night లో ప్రేమతత్త్వమును వర్ణించినాడు. పాశ్చాత్త్యులలో చాలమంది ప్రేమ గలుగుటకు సంగీత మొక కారణమని తలతురు. వేదములు గూడ దీని నంగీకరించుచున్నవి. (తస్మాద్గాయన్తగ్ం స్త్రియః కామయన్తే) యని.

ఒక్క కాళిదాసు తప్ప మిగిలిన కవీశ్వరు లీ విషయములో భవభూతి ననుగమించిరి. మురారి మాత్రము తా నేమో భవభూతిని సర్దబోయి అతని "వ్యతిషజతి పదార్థా" నను సూత్రమునకు కడకు భాష్యమును వ్రాసినాడు. మురారికవి తన యనర్ఘరాఘవ నాటకమునందు ప్రథమాంకమున వామదేవదశరథుల కొక ప్రసక్తి కల్పించి నవ్యనాగకేసరమును నలిపి వాసన జూచినట్లు భావమునకు తగని భాషలో తన భాష్యమును చిత్రించినాడు.

"నూన మిదానీ మస్మానివ తత్రభవన్తం కౌశికమ
ప్యకారణవత్సలం వత్సలయతి వత్సో రామభద్రః."
"యదిందోరన్వేతి వ్యసనముదయం వా నిధిరపా
ముపాధిస్తత్రాయం జయతి జనికర్తుః ప్రకృతితా
అయం కస్సంబంధః యదనుహరతే తస్య కుముదం
విశుద్ధాః శుద్ధానాం ధ్రువ మనభిసంధిః ప్రణయినః"

"రత్నాకరో జనయితా సహజశ్చవర్గః
కిం కథ్యతామమృతకౌస్తుభ పారిజాతాః
కిం త్వైరచింత్యమిహ తత్పునరస్యదేవ
తత్త్వాంతరం కుముదబంధురయం యదిందుః" (అనర్ఘ)

ఇది గుణీభూతవ్యంగ్యము. మురారి అన్వయ వ్యతిరేకములచేత భవభూతిభావమును దృఢపరచినాడు. ప్రేమయను కార్యము బుట్టుటకు కారణ మేదో యుండవలయునని దలచి దానికి సముద్రచంద్రులకు జన్యజనకభావ సంబంధముఁ జెప్పి ఇందు కుముదములవద్ద ఏమీదోచక భవభూతితో నేకీభవించినాడు. ఇంతకు విశ్వహృదయమం దవ్యక్త స్వరూపముతో నున్న అనుభవసాక్షిక ఆనందచైతన్యమే ప్రేమ యని దేలినది.

కాని ఒక వ్యక్తిని మరియొక వ్యక్తి యెందుకు ప్రేమించు ననుటలో స్వాత్మానందమునకై ప్రేమించు నని వేదములు జెప్పుచున్నవి గాని ఆ స్వాత్మానందమునకైనను ఆ వ్యక్తినే ప్రేమించుట యెందులకు యను ప్రశ్నకు మాత్రము పూర్వజన్మ కర్మ విపాకమే కారణ మని జెప్పుచున్నది.

" స హోవాచ. యాజ్ఞవల్క్యః ప్రియాః బతారే నః సతీప్రియంభాషసే. ఏహ్యాస్వ వ్యాఖ్యాస్యామి తే వ్యాచక్షాణస్యతు మే నిదిధ్యాసస్వేతి. స హోవాచ. న వారేపత్యుః కామాయ పతిః ప్రియోభవతి ఆత్మనస్తు కామాయ పతిః ప్రియోభవతి నవారే జాయాయై కామాయ ప్రియం భవతి...... సర్వం విదితం......బృహదార 2-4-2, 34"

అని పూర్వజన్మ సంస్కారమనుటకంటె భవభూతియొక్క వాదమే సమంజసముగ నున్నది. పూర్వజన్మ సంస్కారమే ప్రేమించుటకు హేతువనుట వ్యవహార సమ్మత మను యుక్తిసమ్మతమును గాదు. పూర్వజన్మవాదమందు నమ్మకము లేనివారిని గూడ నాకర్షించ గలవాదము మన భవభూతిది. ఇతను స్త్రీని యొక నీచవస్తువునుగా భావించ లేదు. పవిత్ర ప్రేమమూర్తినిగా వనితాలోకమును సృష్టించినాడు . ప్రేమలో నుండు పవిత్ర తేజస్సును ప్రపంచకమునకుఁ జూపినాడు. ప్రేమతత్త్వ నిర్ణయమునకై ప్రత్యేక ప్రబంధమును వ్రాసినాడు. ఉత్తరరామచరితమందు సీతారాముల ప్రేమను, మాలతీ మాధవమందు మాలతీమాధవుల ప్రేమ బంధములను జూపించి జగతికి ప్రేమతత్త్వము నుపదేశించినాడు. ఇతని రచనల యందు వెంటనే ప్రపంచమునకు ప్రబోధించు కరుణ రసచ్ఛాయలు ప్రసరించుచుండును. అతని హృదయము నిష్ఠాశూన్యము. అతని భావములు వైదికములు. అత నొక కరుణాంభోనిధికర్మిష్ఠుఁడై కమ్మని యద్వైత గీతముల బాడిన రసికావతంసుఁడు. అకామహతుఁడైన బ్రహ్మవాది. శ్రోత్రియ కుటుంబమున బుట్టిన సనాతన చక్రవర్తి. ఇతనికి ప్రేమప్రబంధరచనాపటిమ నెట్లబ్బినదో! భవభూతి ధన్యుడు అతనినిగన్న భరతమాతయు ధన్యురాలు. అతడు బుట్టిన దేశమందు బుట్టుటచే మనమును ధన్యులము.

---

# సంసారము

శ్రీ కుందెం నీలకంఠేశ్వరరావుగారు.

ఉ. ధారుణి బుట్టుమర్త్యులకు దప్పునె? భీకరమై చెలంగు సం
సార మహాంబుధిన్ బడుట సౌఖ్యవిదూరము లంచు నీ మహా
దారుణ సారహీనహిత దారసుతాలయ విత్తసౌఖ్యముల్
కారణముల్ ప్రకాశముగ గన్పడుచుండుట లేద? ధీమణీ!

ఉ. లోకములోన న్యాయమును రూఢిగ నేలిన గోరుచుట్టుపై
రోకటి పోటుచందమున రోయుచు వచ్చిన కష్టరాశినిన్
వ్యాకుల మింతలేక మది పావనరీతిగ గాంచగానగున్
బ్రాకట మొప్ప ధైర్యమును బాయకనుండిన ధారుణీస్థలిన్.

ఉ. ఘోరభవాంబుధిన్ మునిగి కూలము బొందగలేక మర్త్యుడా
హారవియుక్తుడై గతకృతాఘము విస్మృతి జెంది దైవమున్
దూరుచు గల్మషంబు మరి దోరముగా నొనరించుచుంట నీ
ధారుణి గల్కిమూర్తిదగు ధాటియటంచెద నెంతునెంతయున్.

చ. అరయగ నే మహాంబునిధి నైనను నీదగవచ్చు నెంత భీ
కరమగు క్రూరజంతువులు కాండ్రిమటంచును నింగిముట్టగా
నరచుచు రాగ నాయుధము నంటకయే బరిమార్పవచ్చు దు
ర్భరవిషపన్నగంబు గరవన్ గమకింపగ దాటవచ్చు నే
ధరణిని గేహబాధలను తాళగజాల మదేమిచిత్రమో!

చ. తలపగ నిందునైన సుకృతంబులు గాంచగ నౌను రెండు తె
న్నులుగ తరింపగా నగు ననూనయశంబును గాంచి నిత్యమున్
విలసితమైన విద్యగొని వేడ్కజనింపగ బొందగా నగున్
సలలితమైన కీర్తియును సంపద సజ్జన మైత్రి జేయగన్.



# చేతావని ఖండనము

(గతసంచికానువృత్తము)

## ధర్మ కర్మల వ్యతిరేకత అట

చచ్చి స్వర్గమున నున్నవారికే శ్రాద్ధ కర్మలుగాని మరల బుట్టినవారికిని, నరకములో బడియున్న వారికిని శ్రాద్ధకర్మ లెందులకు ? బ్రాహ్మణులు పొట్టకూటికై మోసము చేయుచున్నారని బ్రాహ్మణులపై విఱుచుకొని పడినాడు. కాని యీ మాట విన్నతరువాత ఎంత తెలివి తక్కువ వానికేని చచ్చినవా రే లోకములో నున్నదియు, ఏమై పుట్టినదియు నెట్లు తెలియుగలదు ? అని తోపక మానదు. ఈ మాత్రమైన దెలిసి కొనలేక నో రున్నదని యాక్షేపించినచో ఏమనుకొన వలెనో ఏమి తెలియుటకును వలను పడదు. గనుకనే వాయుపురాణములో చచ్చినవారి నుద్దేశించి కర్మలు చేయుచునేయుండ వలయునని జెప్పబడియున్నది. అట్లిచ్చిన యన్నోదకము లా జీవి యేలోకములో నేరూపముతో నున్నను తత్తదుచితాహారముగా మాఱి ఆ జీవికి జెందునని మార్కండేయ పురాణములో విశదీకరింపబడినది. ఇట్లుండగా చేతావని వారి ప్రశ్న యెంత యజ్ఞాన మూలకమో చిత్తగించితిరా ఇందలి యుద్దేశమేమన ? శాస్త్ర ప్రమాణములతో నడిచెడి వారిని దూషించి వారు చెప్పునదంతయు నిట్లే యుండు నని యవిశ్వాసమును గల్పించుటకై పన్నెడి పన్నుగడలే యివి.

## కలియుగాంత ధర్మము లిప్పుడే కలవట.

కలియుగ సమాప్తి కనేక లక్షణములు చెప్పబడినవి. అందులో నిపుడు జరుగుచున్నవి యెన్నవ భాగముకూడ గావని యెవ్వరైన నమ్మకపోరు. చేతెడు పొడుగు చెట్లట. వ్రేలెడు పొడుగు మనుష్యులట. ఆవులు మేకలవలెనుండునట. మేఘము లన్నియు మెఱుపులతోదప్ప ఉదకముతో నుండవట! 16 ఏండ్లే పరమాయుర్దాయమట. శ్రాద్ధాది కర్మలు బొత్తిగా నుండవట. వర్ణ భేదమనునది యుండనే యుండక సర్వులు మ్లేచ్ఛులేయగుదురట! సర్వులును తమ ఆడువారుచేయు వ్యభిచారవృత్తితో సంపాదించు ద్రవ్యముతో జీవింతురట. ఇంకను ఇప్పటికనుభవములో లేనేలేని యనేక విషయములు చెప్పబడినవి. ఈ ధర్మము లిప్పుడు గలవా ? లేనపుడు కలియుగాంత మెట్లగును ? కనుక కలియుగాంత లక్షణము లన్నియు బట్టుట కింకను లక్షల సంవత్సరములు కావలెనని యొకరు చెప్పకుండనే మెదడున్న వారికి బోధపడగలదు. కావున కలియుగము 1943తో అంతమగు ననునది తెలివితో నన్నమాటగాదు.

## కలికిమూర్తి అవతరించిన శంభల గ్రామము చైనాలోనిదట

కల్కిభగవాను డవతరించిన శంభలగ్రామము యోజనముల విస్తీర్ణము గలదిగా వర్ణింపబడి యున్నదని అంత విస్తీర్ణము గలది మన హిందూదేశములో నున్న శంభల గ్రామముకాదు గనుక ఎన్నడో చీనాదేశములో పట్టణముగా నున్న దని చెప్పబడిన శంభల గ్రామమే కల్కి జన్మస్థానమని యొక యపూర్వసిద్ధాంతమును లేవదీసి యున్నాడు. కాని ఆదేశములో బ్రాహ్మణాది వర్ణవిభేదములు లేవు గదా! కల్కిమూర్తి బ్రాహ్మణ వంశములో బుట్టుట యెట్లు? అను వివేకము లేకపోయినది! శంభల గ్రామ మను పేరిటిలో జిన్న గ్రామమైన నిప్పుడు మన దేశములో గనబడుచున్నదిగాని యెన్నడో తాతల తండ్రులనా డుండెనని పత్రికృత మెడారియై పోయినదని చెప్పుట యెంతవివేకమో ఆలోచింపుడు. కల్కిమూర్తి పుట్టిన దేమో యిప్పటికి 16 ఏండ్ల క్రిందటనట! చైనాలోని శంభల గ్రామములోనట! ఆ గ్రామమేమో యెడారియైపోయి యెంతో కాలమైనదట! ఈ చిత్రమేమో కనుగొనుడు. స్థలభోగ మెవ రెఱుగుదురు? కనుక 4 లక్షల మీదటి కాలములో నిప్పటి శంభల గ్రామమే యోజన పరిమితము కావచ్చుగాక. మన చేతావని వారి కల్లకల్పన లిట్లున్నవి.

## మచ్చుమందు

ఇప్పటి వాతావరణమును బట్టి స్వమత గ్రంథములకంటె పరమత గ్రంథములవలన నమ్మిక పుట్టింపవచ్చునని గుర్తించి చేతావని కర్త తాను జెప్పినట్లు మహమ్మదీయ మత గ్రంథములలోను, క్రైస్తవమతగ్రంథములలోను నున్నదని కొన్ని ప్రమాణములనిచ్చి మచ్చుమందు చల్లియున్నాడు. నిజముగా నవి చూచిన తరువాత నిజమే కాబోలునని యనుకొనవచ్చును. కాని యే మత గ్రంథములు చెప్పినను కాలచక్రములో నొకానొకప్పుడు విపరీతమైన మార్పు గలుగునని మన మతగ్రంథములలో జెప్పినట్లే చెప్పుచున్నవి గాని 1943 లోనే అట్లగునని యెక్కడను జెప్పలేదు. మతాంతరగ్రంథముల నుండి యిచ్చిన ప్రమాణములు 1943 తో కలియుగము సమాప్తమగునని నిరూపింపలేదు. కనుక ఆ వ్రాత లన్నియుఁ జేతావనిస్వామి తన కనుకూలము లని వ్రాసికొన్నవి మాత్రమే. కనుక అట్టి భ్రమ యేమి పెట్టుకో నక్కఱలేదు.

## యుద్ధప్రసక్తి

లోకములో జాలమంది చేతావనిలో జెప్పినట్లు యుద్ధములు జరుగుచున్నవిగదా! అందులో జెప్పిన విషయములుకూడ నేల నమ్మరాదని చెప్పుచున్నారు. కాని కొంచెము తెలివితేట లుపయోగించి తెలిసికొన గల్గుచో పంచాంగములలో మన సిద్ధాంతులు వ్రాసినదానికంటె నిందులో విశేషములేదు. ఇప్పటి యుద్ధప్రసక్తిని గుఱించి పంచగ్రహకూట మని, షడ్గ్రహకూటమని, సప్తగ్రహకూట మని తెలిపి తత్ఫలితముగా యుద్ధములు

జరుగునని వ్రాసియే యున్నారు. చేతావనివారు మనవారికంటె విశేషము చెప్పినదిలేదు. అట్లు జరిగినదియులేదు. కనుక అట్టిభ్రమ పెట్టుకొనరాదు.

## 1943 నుండి యేమి జరుగునట

1943 ఆగష్టు 1 వ తేదినుండి కలియుగ మంతమై కృతయుగము వచ్చును. గనుక ఆ కృతయుగధర్మములు నడచునట. మంచిదే, సంతోషింపదగినదే. అయినచో ఎట్లు జరుగవలె ననగా పెద్దలముందఱ పిన్నలు చావరట! స్త్రీలు విధవలు కారట! 4 వందలయేండ్లు జీవింతురట! వ్యాధు లుండవట! ఆస్పత్రిలతో అవసర ముండదట, జనులు పాపము చేయరట! బంగారముతో గోడలు కట్టుదురట. సంతోషము. అంత పుణ్యము పుట్టినచో అంతకంటె కావలసిన దేమి? చూతము. ఈ కన్నులకు రెప్పలు దూరము గావుగదా! అన్నియు రెండేండ్లకు కాలపురుషుడే నిర్ణయింప గలడు.

## సూ ర్య గ్ర హ ణ ము

శ్రావణ బ 30 లకు బ్రహ్మాండమైన సూర్యగ్రహణము వచ్చునట. అది కలియుగాంతదినమున నారంభమై కృతయుగారంభ దినమున నంతమగునట. ఇందును గుఱించి చదువరు లెంత భ్రమపడవలెనో అంతగా వ్రాయబడినది. పై వ్రాతనుబట్టి రెండుదినముల గ్రహణ మని అర్థమవక, మొకదినమంతయు పట్టునని మైన దోపకపోదు. కాని యెంత సంపూర్ణ గ్రహణమైనను 4 గంటల కెక్కువ కాలముండదను విషయము లోకమున కెల్లు తెలియ గలదు! పంజాబు దేశీయుఁడు శ్రావణామావాస్యకు గ్రహణ మని చెప్పిన సరిపోవుఁగాని మన దేశీయులగు వడ్డాది వీరరాజు సిద్ధాంతిగారును అట్లే వ్రాయుటలో వీరి గ్రంథ మెట్టిది యైనదియుఁ దేటతెల్ల మగుచున్నదిగదా! 1943 ఆగస్టు 1వ తేది ఉత్తర దేశీయులకు శ్రావణామావాస్య అగును. మనకు ఆషాఢామావాస్య యగుచున్నది. ఆ దేశీయులకును, మనకును మాస సంజ్ఞలో నొకమాసము వ్యత్యాసముగా నుండునను సంగతి వడ్డాదివారు గమనించి యుండవలసినది. మొత్తముమీఁద 1943 లో వచ్చెడి సూర్యగ్రహణము ఆషాఢ అమావాస్యనాఁడేగాని శ్రావణామావాస్యనాడుమాత్రము కాదు. కలియుగాంతమునకుగాని కృతయుగారంభమునకుగాని గ్రహణము సూచకముగాదు గనుక మన కా విషయ మవసరముగాదు.

చేసిన మాయతంత్ర మంతయు నిట్లున్నది. దీనిచేత వారు తలపెట్టినట్లు పరమార్థ ప్రాప్తికి లోటులేకుండ సర్దుబాటైనది.






వీరశైవ మహాసభ, హిందూద్రోహము:—చిరకాలమునుండి అనూచానముగా భారత వర్షమున సాగివచ్చుచున్న వీరశైవ మతమునుగూర్చి ప్రస్తుతము విస్తరింప పనిలేదు. వేదాగమ ప్రతిపాదితమగు ధర్మమునే నిర్వహించుచు, వైదిక దేవతను వైదికపంచాక్షరీ మహామంత్రముతో నుపాసించుచు, వీరశైవ వైదికాచార సంస్థాపకులైన శ్రీజగద్గురు రేణుకాదిపంచాచార్యుల ననుసరించుచు వీరశైవ సనాతన లోకము నేటికిని జీవించి యున్నది. 1904 వ వత్సరమున ధారవాడలో వీరశైవ మహాసభ స్థాపింపబడినది మొదలు నూతన దృక్పథ మేర్పడి ఆధునిక విద్యా సంపన్నత వర్ధిల్లెను. ఐనను వీరశైవ తత్త్వముల కీ మహాసభ యనుకూలముగనే ప్రవర్తించుచుండెను. కావుననే ౧ వ వీరశైవ మహా సభలో "౧. (అ) వీరశైవ మతము నిగమాగమోపనిషద్భాష్యప్రతిపాదితత్వముచే అనాది సంసిద్ధ మనియును, శ్రీ బసవేశ్వరు డీ మతమును ప్రచుర మొనర్చెనే కాని స్థాపకుడు కాడని శిలాశాసనాది ప్రమాణములతో సిద్ధమగుచున్న దనియును ఈ మహాసభవారు ఖండితముగా చెప్పు చున్నారు"—అని భేరీ నినాదము చేయబడెను.

ఇంతియకాదు. 1905 లో బెంగళూరున జరిగిన ౨ వ మహాసభలో "౫ వీరశైవులలో సంస్కృత విద్యాభ్యాసము హెచ్చుటకై ముఖ్యమైన పట్టణములలో సంస్కృత పాఠశాలలను సంస్థాపింప వలె"నని యును, 1907 లో సోలాపురమున గూడిన ౩ వ మహాసభలో "౮ మన సమాజపు జంగములలో సంస్కృతవిద్య, ముఖ్యముగా వైదిక విద్యయొక్క ప్రసారము అవశ్యము గావలె"ననియును, 1908 లో బాగిలుకోటలో జరిగిన ౪ వ మహాసభలో "౧౬ వీరశైవ మతము వేదాగమోపనిషత్తులచేత సంసిద్ధమైన ఉన్నత మతమై యున్నది" అనియును, 1911 బెళగాంలో ౫ వ మహాసభలో "౪ మన వీరశైవ ధర్మము సనాతనమును, వేదాగమోపనిషత్ప్రతిపాద్యమును, ఉదారమతపరిప్లుతమును ఐయుండుటవలన ఆ ప్రకారము భక్తిశ్రద్ధాపురస్సరముగ ఏతన్మతీయులు వర్తింపవలె"ననియును. 1917 దావణగెరెలోని ౮ వ సభలో "౬ శ్రీకరభాష్యమును ముద్రించుచున్న శ్రీ కె. పి. పుట్టణశెట్టిగారికి వీరశైవులు తోడ్పడుటయె కాక ఇట్టి మహాగ్రంథముల ప్రకటింపవలె"ననియును, 1927 బెంగళూరులోని ౧౦ వ సభలో "౫ వీరశైవులలో సంస్కృత వైదిక విద్యాభ్యాసమునకు ఉత్తేజనము నీయుట కీ సభవారు నిర్ధారించుచున్నా" రనియును కంఠోక్తిగ వీరశైవ మహాసభవారు చాటుచునే యుండిరి.

1925 లో నిజాంరాజ్యమున పరళీ వైద్యనాథ రుద్రాభిషేకమునకు సంబంధించిన స్మార్త వీరశైవ శాస్త్రవాదము జరుగుటయు, వీరశైవమతముయొక్క వైదికత్వము సామాన్యలోకమునకుగూడ వెల్లడి యగుటయు సుప్రసిద్ధము. ఈ విజయమునుగూర్చి 1933 రాయచూరున ౧౧ వ వీరశైవమహాసభలో ౬ (అ) హైదరాబాదు సంస్థానము పరళీ ప్రకరణమున జరిగిన వీరశైవ స్మార్త వ్యాజ్యములో నిజాం సర్కారువారు వీరశైవుల పక్షమున న్యాయమును నిర్ణయించినందులకు ఆ సర్కారువారిని ఈ సభ యభినందించుచున్న"దనియును ఘోషించిరి. దీనివలన 1933 వరకు వీరశైవ మహాసభకూడ వైదికమై సనాతనమై పవిత్రమైన హిందూధర్మము నవలంబించు ప్రాచీనాచార్య సంప్రదాయమును సంరక్షించుచున్నదని వేద్యము కాగలదు. వీరశైవ మతీయులైన సమస్తజనములుకూడ తాము హిందువులమని చెప్పికొనుటయేకాక సర్కారుకు సంబంధించిన కాగితపత్రములలోను రిజిష్టరు డీడులలోను వ్రాసికొనుచు తమ హిందూత్వమును నేటివరకు బాహాటముగ వ్యవహరించుచునే యున్నారు.

వీరశైవ మహాసభ యను సంస్థ స్థాపింపబడి ౩౬ సంవత్సరములు గడచినవి. అది మొన్నటివరకును స్వమతమునకు సంబంధించిన సమస్యలను విడదీసికొనుచు, ముఖ్యముగ విద్యాప్రచార విధానములను ప్రోత్సహింపుచు శాంతముగ సాగుచుండెను. అది సమస్త వీరశైవ జనాంగమునకు ప్రమాణమై యధికారమును నిర్వహించు స్థితికి రాలేదు. కాని "గుడ్డికంటె మెల్లగన్ను మేలుగదా" యన్నటులు నూతనవిద్యా భూషితులు కొందరకిదియే యొక లీలావస్తువుగా నున్నందున సభ జరిగినపుడెల్ల యొక వేడుక లోకమునకు ప్రత్యక్షమయ్యెడిది. దీనిమూలమున నీ సభకు కొంత గౌరవముగూడ నేర్పడినది. ఇక ముందైనను ఒక నిర్ణీతమైన పద్ధతికి రావచ్చునని యెప్పటి కప్పుడు నిరీక్షించుచు దృఢమైన విశ్వాసము లేకపోయినను అస్మదాదులును ఈ మహాసభలో పాల్గొనుట తటస్థించుచున్నది. కట్టుదిట్టములైన వ్యవహారములు లేకపోగా ఇటీవల నీ మహాసభ కొందరి వ్యక్తుల యధికారములకు లోబడుచు అల్లరివేదికక్రింద తయారగుచున్నందులకు వివేకము గల వీరశైవు లందరును విషాదము నొందుచున్నారు.

వీరశైవమతమును ద్రావిడసంస్కృతికి జెందజేసి యొక యద్భుతగాథను నేడు కొందరు నిలవేయ బూనినారు. ఇట్టివా రందరును ఈ వాదమునకు సంబంధించిన వాఙ్మయమును గాని మతచరిత్రలను గాని యభ్యసించని పసిబాలురై యున్నారు. అందువలన నీ విషయమును చర్చకు రానీయక చిన్న చిన్న సభలలోను మహాసభలలోను విచిత్రములైన ఓట్ల పన్నాగముల వలన తమ యభిప్రాయములు మహాసభానుమతిని బడసినట్లును, సత్యములైనట్లును పామరలోకమునకు జెప్పికొనుచు ఉబ్బి తబ్బిబ్బగుచున్నారు. ఇంతవరకే యుండుచో క్షంతవ్య మనుకొనవచ్చును గాని యది శ్రుతిమించిన యాలాపన లోనికి వచ్చినది. ఒకరు "వీరశైవుల మాతృభాష కన్నడ" మందురు. మరియొకరు

"వేదాగమములు మాకు ప్రమాణములు కా"వనిరి. "మాది ద్రావిడమతము. సంస్కృత భాషతో అవసరము లే"దని యొక లింగాయత పుంగవుడు సంగీతము చేయగా ఇంక సంకోచ మెందుల కని "మేము హిందువులమే కాము. మా మతము హిందూమతము కంటె కేవలము భిన్నమైనది" అని రంకెవేయుచు హిందూమతముతో విడాకులు పుచ్చుకొనుటకో ఇచ్చుకొనుటకో సిద్ధపడు చున్నాడు. మా యాంధ్ర వీరశైవులలో చాలమంది యిట్టి యద్భుత వార్తను విని యుండరు. వెనుక నిట్టి రాగమునే పాడుచు కొందరు శ్రీ హైదరీగారితో డిప్యుటేషనుకు వెళ్ళిన సందర్భమునను 'విభూతి' పాఠకులకు వివరించి యుంటిమి. దాని యందు, వీరశైవుల హిందూత్వమును స్పష్టపరచినది గాన నగును. ప్రస్తుతము, వీరశైవ మహాసభా సూత్రధారులు తమ నాటకమును మరికొంత పబ్లిక్కుకనకు నీడ్చుకొని వచ్చినారు. మహాసభాపక్షమునసుండు, సాక్షాత్తుగా కాదు గాని, ఆక్టరు లందరు వారే! మహాసభాధ్యక్షులును, సభ్యులు మున్నగువారు "బొంబాయి ప్రాంతమందలి వీరశైవ ప్రముఖులు" అను నామమును ధరించి గడచిన అగస్టు 29 వ తేదీని బొంబాయి గౌర్నరుగారిని సందర్శించి తమ డెప్యుటేషనుకు సంబంధించిన వ్యాస మును సమర్పించినారు. దానియందలి సమస్త విషయములను వివరించుట కిది సమయము కాదు. "మేము హిందువులు, మహమ్మదీయులు మున్నగువారి కంటె భిన్నులమై యున్నాము. మా లింగాయత మతము కేవలము ప్రత్యేకత గలిగి యున్నది" అని వారు నివేదించిన యభిప్రాయమే ముఖ్యముగ విమర్శనీయమైయున్నది. వీరు హిందువులు కాకుండుటకు కారణము లేవియో స్పష్టముగ వివరింపలేదు కాని "హిందువులము కాము కామ"ని వీరు మిక్కిలిగ వాకొనుటకు సిద్ధపడినారని మాత్రము గ్రహింపవచ్చును. చిరకాలమునుండి వీరి పూర్వపురుషులే కాక వీరును మహాసభాపక్షమున మొన్నటి వరకు హిందువులుగానే యుండిరి. అర్జునుడు బృహన్నలగా మారినపుడు ఉపయోగించిన మందేదో వీరికి దొరికినట్లున్నది. లేనిచో ఈ లింగాయతపుంగవులు హిందూత్వమును వదలుకొని ద్రావిడ గోవులుగా మారుట సామాన్యమైన విషయము కాదు. పోనీ వీరు హిందువులు కానట్లుగ ప్రభుత్వమువారు స్వీకరించిద్రావిడత్వపు సర్టిఫికేటుల నేమైన ననుగ్ర హించినారా? అంటే అది అసలే లేదు. హిందువులము కామని యెవరో ఆక్రోశించి నంత మాత్రమున వీరశైవుల హిందూత్వము పోజాలదు. ఇంతగా వీరు ప్రాధేయపడు టకు స్వార్థపిశాచము కారణము గాలేదని చెప్పజాలము. దీనికి కొంత గాథయు కలదు.

వీర శైవులలో కొందరు ప్రభుత్వోగులును, మరికొందరు అతిరాజభక్తులును కలరు. వీరందరు ప్రభుత్వ ప్రేమను ఏవిధముగ నైనను సంపాదింప నెంచినారు. సుఖము దక్కినను దక్కకున్నను సరియే, కులమును మాత్రము వదలుటకు వీరు సిద్ధపడినారు. హిందువులలో హరిజన పక్షమ్ముక్టొకటి యుండియే యున్నది. ఈశ్వరానుగ్రహము వలన సనాతనుల సంఘము, సంస్కర్తల సంఘము అను రెండు బృహత్పక్షములును భీకరాకార

మును దాల్ప వచ్చును. ఆర్యసమాజ భాయీల అనన్యసామాన్యరాగమును ఆలాపింపబడుచునే యున్నది. ఇంతలో లింగాయతులు ద్రావిడ సైన్యము "ప్యారషూటు"ల నుండి జారి పడుట శుభావహము కదా! ఉత్తరదేశపు ఆసాము పర్వతములలో నుండి ఒక "మంగోలియన్" సంఘము కూడ బైలుదేరుచో ఎంతబాగుండును? ఈ యుద్ధకాలము నాటికి హిందువులలో ఇన్నిరకముల గుర్తులు బైలుదేరినందుకు శుభోదయ మనుకొనవలసినదే! ఇట్టి విభేదములు పెరిగినకొలదియు రాజ్యము ననుభవించువారికి ప్రోత్సాహకరమో నిరుత్సాహకరమో మే మూహింప లేకున్నాము. అది రాజనీతిజ్ఞులు దేల్చవలసిన మాట. హిందువులు కారనుటయే ఎందులకు? క్రిశ్చియనుల మనియో, మహమ్మదీయుల మనియో చెప్పినచో తరుగని సంపత్తు లభింపగల దను నమ్మకము వీరికి గలదా! దురదృష్టమున కిది పరమావధి కాక మరేమగును? మహాకష్టనష్టములను లెక్కించక కాంగ్రెసువా రొనర్చు ఏకజాతీయతాప్రయత్నము లెక్కడ! ఈ మూఢప్రపంచకము యొక్క స్వార్థద్రోహము లెక్కడ? స్వజాతికే విశ్వాసఘాతము గలుగజేయుచున్న వారిని పరజాతీయ ప్రభుత్వము స్వామిభక్తులుగా నమ్మునట! చిరకాల సహవాసము తరువాతనైనను ప్రభుత్వముయొక్క దృక్పథమును ఈపన్మాత్రముగ గమనింపని ఈ బుద్ధిశత్రువుల నేమనవచ్చును? హిందువులలోనుండియే తమ మతీయులు వెనుకబడియున్నారని చెప్పుట తప్పా? ఇటు లనినచో ఉద్యోగములు దొరకవని ప్రభుత్వము ఎవరికేని ఉపదేశించినదా! వీరశైవులు, వైదిక దేవోపాసనను జేయుచున్నారు కావున హిందువులనియే మేము దృఢముగ నమ్మియున్నాము. వీరశైవమహాసభకు ఇట్టి సమస్యను పరిష్కరింపవలెనని ఇష్టము లేదు కావుననే వక్రమార్గమునుబట్టి ఈడ్చుకపోవుచున్నది. ఇది ఓట్లబలముతో నిర్ణయించదగిన విషయమే కాదు. ఇతిహాసమును శాస్త్రమును ఎరిగిన పండితులే ఎన్నటికైనను సిద్ధాంతపరచవలయును. విషయము తేల్చుకొనువరకైనను తటస్థముగ నుండక హిందువులము కామని ప్రచారము చేయుట ద్రోహమనియే మా తలంపు.

బొంబాయినగరమున ముందు డిశంబరులో వీరశైవ మహాసభ జరుగనున్నదట! అపుడైనను మిక్కిలి మహత్వముగల ఈ విషయము నిష్కపటముగ విచారింపబడునో లేదో తెలియదు. ఆంధ్రవీరశైవులును, కర్ణాటక మహారాష్ట్రము లందలి అసంఖ్య వీరశైవ సోదరులును ఈ దుర్వాదమును ఖండింతు రనియును, బుద్ధితో నాలోచింతు రనియును మేము విశ్వసించుచున్నాము. ఈ విషయమును పత్రికలలోగాని, సభాముఖమునగాని చర్చించుటకు మేము సిద్ధముగా నుండగలము.

నిజాంప్రభుత్వము, పత్రికాసాహాయ్యము:—యుద్ధము వలన కాగితముల ధరలు మూడురెట్లకంటె నెక్కువగా పెరిగిన సంగతి యందరకును దెలియును. పత్రికాధిపతు లందరు మిక్కిలి దెబ్బ దినుచున్నా రనుట యతిశయోక్తి కాదు. వీరి కష్టముల గమనించి దయామయులును, ఉదారచరితులును, మహా శ్రీమంతులును అగు

ఘనత వహించిన నిజాం ప్రభుత్వమువారు తమ రాజ్యమందలి పత్రికలకు కొంత చౌక ధరలో కాగితము సప్లై చేయుచున్నారని తెలిసి సంతసించనివా రుండరు. కాని "చూడ జూడ రుచుల జాడవేరు" అను తత్త్వమును కనుగొనగా మాకు గలిగిన నిరాశ యింతింతనరానిది. వారు హైదరాబాదు పత్రికలకే సాహాయ్యము చేతురట ! సికిందరాబాదు పత్రికలు బ్రిటీషు ఇండియా పత్రికలట ! ఈ సలహాను ప్రభుత్వమువారి కెవ రిచ్చినారో కాని మహాశ్చర్యముగ నున్నది. సికిందరాబాదులో బ్రిటీషు కంటోన్మెంటు ప్రభుత్వమునకు కొన్ని విశేషాధికారము లున్నమాట వాస్తవమే కాని ఇది నిజాంరాష్ట్రమే అయ్యున్నదని బుద్ధిగలవా రందరును అంగీకరింపగలరు. నిజాం ప్రభుత్వమువారి అంగీకారము లేనిదే సికిందరాబాదు సిటీ మేజిస్ట్రేటుగారు పత్రికలకు అనుమతి నీయుటలేదని స్వానుభవము చెప్పుచున్నది. సికిందరాబాదులోనివారందరును ముల్కీలనియే వారికి నుద్యోగములు లభించు చున్నవి. ఇక్కడ ని. ప్ర. కరోడ్గిరీ ఆఫీసు (సుంకముశాఖ) ఉండుటయే ఇది నిజాం ప్రభుత్వమువారి యధికారమునకు లోబడి యున్నట్లు స్పష్టపరచు చున్నది. ప్రకటనల వలనను, విశేష ప్రచారముల వలనను, శ్రీమంతములైన పత్రికలకును సాహాయ్య మొనర్చి "విభూతి" బోలిన ప్రభుభక్తి గలిగినట్టియు, మరొక ఆదాయము లేనట్టియు కేవల సారస్వత సేవ జేయునట్టి బీదపత్రికలకు నిజాం ప్రభుత్వము వారి యండ లేకుండుట మిక్కిలి విచారకరము. దీవించిన వారిని భావించక తిట్టినవారికి బెట్టుట. 'బలాచ పృథ్వీ' యను సామెతను సమర్థించుచున్నది. బలముకుంగి పడిపోవుచున్న పత్రికల నుద్ధరించుట పరమ పవిత్రకర్తవ్యమని యికనైనను శ్రీ శ్రీ నిజాం ప్రభుత్వమువారు పునర్విమర్శనతో చిత్తగింతురని నిరీక్షించుచున్నాము.

సికిందరాబాదు కంటోన్మెంటు ప్రభుత్వము వారైనను విపద్గ్రస్తములైన సికింద్రాబాదు పత్రికలనుగూర్చి దయతో నాలోచించుట పరమావశ్యకము. "మా భాగ్యమెట్లున్నదో !"

హైదరాబాదు విద్యావిధానము:—లక్ష్మీ సరస్వతులకు పరస్పర వైరమున్నట్లు సనాతనులు చెప్పుకొనుటయేకాదు. ప్రత్యక్షముగ గానవగును. శ్రీమంతమునకు మా ఘనతవహించిన మహాప్రభువులవారు ప్రపంచవిఖ్యాతి నంది యున్నారు. విద్యావిషయమున నిజాంరాజ్యము చిన్న చిన్న సంస్థానములకంటె వెనుకబడి యున్నది. ప్రభుత్వమువారు విద్యకై వినియోగించుచున్న ద్రవ్యము స్వల్పముకాదు. మిక్కిలి యెక్కువని యెవరైనను ఘోషింపవచ్చును. మరి ప్రచారాధిక్య మెందులకులేదు ? అది ప్రజల యదృష్టమే కావచ్చును. లేదా విద్యావిధాన లోపమైనను కావలెను. దీనిని గూర్చియే ప్రజాప్రముఖులు ప్రభుత్వముతో రాయబారము నల్పుచునే యుండిరి. అన్నట్లు మెకంజీస్కీము కూడ ఒకటి ప్రదర్శింపబడెను. కాని ప్రజాందోళన తగ్గలేదు. ప్రస్తుతము మరొక క్రొత్తవిద్యా ప్రణాళికను చొరబెట్ట నున్నారు. దీనితో ప్రజా

శయమును ప్రభుత్వమే మాత్రము లక్ష్యము చేయజాలదని మా బోటి సనాతన వాదులకును భయమగుచున్నది. ఇచ్చోటి ప్రజల మాతృభాషలగు ఆంధ్ర మహారాష్ట్రములకు ఇకమీద సామాన్యముగ క్రింది తరగతులలో పరీక్ష లక్కరలేదట! కూర్చొని ఉబ్బు బడువారికి పరుపులు వేసినట్లుకదా! అసలే దేశభాషల భాగ్య మధ్యాహ్నముగ నున్నది. ఇక బరీక్ష లవసరము లేనపుడు పట్ట భద్రమూర్తులు గాబోవు సమయమున మాతృభాషను లక్ష్యము చేయగలరా ? భారత వాఙ్మయ శిరోమణియైన సంస్కృతమును నిజాం ప్రభుత్వమువారు మిక్కిలి దుర్లక్ష్యము చేసియే యున్నారు. ఒక్క కాలేజిలోనైనను సంస్కృతమునకు ప్రత్యేకముగ ఉపాధ్యాయులు లేరు. ప్రత్యేక పరీక్షాదులు లేనందున యూనివర్సిటీ సంస్కృత పదముకూడ త్రిశంకులోకమున నూగుచున్నది. హైస్కూళ్ళు మిడిల్ స్కూళ్ళు మున్నగు వానిలోను ఆంధ్రాది దేశ భాషలకు ప్రత్యేకోపాధ్యాయు లరుదు. ఇది యంతయు నొక యయోమయముగనున్నది. రాజకీయాధికారముల గూర్చియే ఆందోళన పడుచున్న ప్రజలకు విద్యా సౌకర్యమునందైనను ఔదార్యము జూపుట దూరదృష్టి గల ప్రభుత్వమునకు పరమావశ్యకములని విన్నవించుచున్నాము. ప్రజలు తమ బిడ్డలని భావించువారు ప్రజల మాతృభాషలో కొంతవరకైనను కట్టుదిట్టమైన విజ్ఞాన దాన వ్యవస్థను చేయవలెను. ప్రజల దీవనలే యెన్నటికైనను ప్రభుత్వ కీర్తికి జీవనరక్షలు. క్రొత్త సౌకర్యము లేకపోగా ప్రాత సౌకర్యము లడుగంటరాదు. మైసూరు, బరోడా, ట్రావనకూరుల సంగతి మాకక్కరలేదు. జమఖండివంటి చిన్న జాగీరు విద్యాసమాచారములైనను చిత్తగింపవలెను.

విషాదవార్త:—నిడుదవోలు నివాసులు శ్రీ దేటిశెట్టి అమ్మన్నగారు 5-9-1941 తేదిని శివైక్యము నొందిరను విషాదవార్త యిపుడే మాకు తెలిసి మిక్కిలి విచారమును గలిగించెను. శ్రీఅమ్మన్నగారు స్వయంకృషివలనను, వ్యాపార ప్రతిభలవలనను పేరు ప్రతిష్ఠలను సంపాదించిన శ్రీమంతులు. స్వమతమునందును, బంధులోకమందును మిక్కిలి యభిమానము గలవారై యా ప్రాంతమున ప్రసిద్ధినంది యుండిరి. విద్యాపక్షపాతిత్వము గూడ వీరికి మెండుగా నుండెను. 'విభూతి'కి శతరూప్యముల నొసంగి సంతోషముగ రాజపోషకత్వము నంగీకరించిన యుదారులు. మా చిరకాల పరిచితుడైన నిట్టి వీరశైవ ప్రముఖుని గోల్పోయి నందులకు విషాదించుచు వారి పరివారమునకు మా సానుభూతి నందజేయుచు పరమేశ్వరుడు పరలోకగతాత్మకు పరమ సాయుజ్యము నందజేయునట్లు ప్రార్థించుచున్నాము.

'విభూతి' యొక్క సహాయకులును, వివిధవిధముల మాకు నెల్లపుడు సహకారులును అగు హైదరాబాదు నివాసులు శ్రీ రావికోటి మఠము వీరభద్రయ్యగారి ధర్మపత్ని ఈ 14-10-1941 తేదిన తనపిన్నప్రాయమున కైలాసవాసురాలైనదను దుర్వార్తను తెలుప

వలసి వచ్చినది. ఆమెగారి భర్తయును బాలురును అనుభవించుచున్న విషాదమునకు మా అనుతాపము నందజేయుచు మృతాత్మకు సద్గతిని, జీవితులకు సుస్థితిని దయామయు డనుగ్రహించుగాత యని ప్రతీక్షించుచున్నాము.

## సోలాపురమునకు జగద్గురువుల ఆగమనము

గత సంచికలో దెలిపిన ప్రకారము సోలాపురమునకు రంభాపురి (బాళెహళ్లి) వీర సింహాసనాధీశ్వరు లును శ్రీ రేణుకాచార్య పరంపరాచార్యులును, అగు శ్రీ జగద్గురు శివానంద రాజేంద్ర శివాచార్య మహా స్వాములవారు త్వరగా విజయము చేయ నున్నారనియును, అపూర్వమైన ధార్మిక మహాసభలు నెరవేరునని యును, శ్రీ వారి యాగమనము నాటి మహోత్సవము సార్వభౌమముగా నుండు ననియును, కనీసము ఇరు వదివేల జనసమూహము చేరు ననియును మహాప్రయత్నములు జరుగుచున్నవి. తక్కిన చతురాచార్య జగద్గురువుల యాగమన మగుననియును వదంతులు కలవు. కార్తిక శుద్ధ చతుర్దశినాటికి సభాకార్యము లారంభమగును. ఏమాత్ర మవకాశ మున్నను ఈమహాపర్వము నవలోకించు భాగ్యమును బోగొట్టుకొనరాదు.

(వీరశైవ గర్జననుండి)

## మా స హా య కు లు

వల్లూరుపాలెం నివాసులైన శ్రీ లక్కన వీరభద్రయ్యగారును, నర్సాపురం శ్రీ చదువుల బసవళంక రయ్యగారును, గద్వాల శ్రీ దండె చినవీరప్పగారును, ఈమని బూసా వీరయ్యగారును చింతకుంట రాచయ్య పంతులుగారును, మిక్కిలి యభిమానముతో 'విభూతి'కి క్రొత్తచందాదారులను జేర్చుటయే కాక యనేక గ్రంథముల చెప్పించి ప్రచారము జేయుచున్నందులకు కృతజ్ఞులమై యున్నాము.

నర్సాపురం శ్రీ పుట్ల గౌరమ్మగారు 2-0-0లను 'విభూతి'కి దానముగా బంపించి ప్రోత్సహించినారు.

## గుల్బర్గవార్త

జిల్లా గుల్బర్గానగరమందలి కర్ణాటకసంఘమువారు "నాడహబ్బ" యను మహోత్సవము గావించి కర్ణాటకదేశమందలి గొప్ప గొప్ప విద్వాంసుల నాహ్వానించి మహోపన్యాసముల గావించిరి. సెప్టెంబరు 25, 26 తేదులలో క్రమముగ "వైదికధర్మము" "ఆర్యద్రావిడ విభాగవిమర్శ" అను రెండు మహోపన్యా సములను మూడు మూడు గంటలకాలము పం. చి. మ. వీరభద్రశర్మగారును గావించిరి. ౧వ రోజున ౩ వేలజనమును, ౨వ రోజున ఐదువేలజనమును క్రిక్కిరిసి యుండిరి. స్వపరమతీయు లందరును ఔపన్యాసకుని మిక్కిలి పొగడి సత్కరించిరి. నగరమందలి సమస్త విద్వాంసులును, ఉద్యోగులును పాల్గొనియుండిరి. గుల్బర్గ కిది యపూర్వశోభను గల్గించెను.

—"సంయుక్త కర్ణాటక" నుండి.

## సహాయకులు

| | |
|---|---|
| శ్రీ శ్రీ అవధూత బసవరాజుగారు | నూజివీడు |
| ,, వే. బసవయ్యస్వామిగారు | శ్రీశైలము |
| ,, అవధూత పర్వతాలయ్యగారు | రంగాపురం |
| ,, చిలువూరు శంభయ్యగారు | చిలువూరు |
| ,, చదువుల బసవశంకరయ్యగారు | నరసాపురం |
| ,, చుక్కా పాపయ్యగారు | వల్లభాపురం |
| ,, పాలకొల్లు చెన్నబసవయ్యగారు | కనగాల |
| ,, కుంచాల నాగయ్యగారు | ,, |
| ,, కుంకులగుంట బసవయ్యగారు | నరసరావుపేట |
| ,, ఎస్. సోమేశ్వరరావుగారు, హైకోర్టువకీలు | వికారాబాదు |
| ,, రావికోటిమఠం వీరభద్రయ్యగారు | హైదరాబాదు |
| ,, పట్నంశెట్టి మల్లప్పగారు | మెదక్ |
| ,, దొడ్డ కోటయ్యగారి వీరన్న గారు | నల్లగొండ |



Regd. No. M. 4122.
H. E. H. Nizam's 165.

"VIBHUTI"
SECUNDERABAD Dn.

Editor:—PANDIT C. M. VEERABHADRA SHARMA.

## ప్రతిష్ఠాపకులు

| | |
|---|---|
| శ్రీ జగద్గురు శివానంద రాజదేశికేంద్ర మహాస్వాములవారు | రంభాపురి |
| శ్రీ జగద్గురు సిద్ధేశ్వర శివాచార్యమహాస్వాములవారు | ఉజ్జయిని |
| శ్రీ జగద్గురు పంచాక్షర శివాచార్య మహాస్వాములవారు | కాశి |
| శ్రీ జగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములవారు | గుంతకల్లు |
| మ. బ్ర. శ్రీ చెన్నవీర శివాచార్య సావిరదేవర స్వాములవారు | బిచ్చాలి |
| మ. బ్ర. శ్రీ ముమ్మడి సిద్ధశంభుస్వాములవారు | చేబ్రోలు |

## మహారాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ మహారాణిగారు | గద్వాల సంస్థానము |
| ,, జి. హెచ్. వీరన్నగారు, గుబ్బి | బెంగుళూరు |
| ,, చుక్కా శనగల కోటివీరయ్యాగారు | కొర్రపాడు |
| ,, నేలవల్లి కోటయ్యాగారు | దుగ్గిరాల |
| ,, రాచంశెట్టి కోటివీరయ్య, కొలగాని నాగయ్యాగార్లు | ,, |
| ,, నాగూరు మల్లప్ప షావుకారుగారు | నంద్యాల |
| ,, ఆరాధ్యుల మూటయ్యాగారు | చామర్లకోట |

## రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ శ్రీ అందెల కోటివీరయ్యాగారు | చేబ్రోలు |
| ,, అందెల కోటినాగయ్యాగారు | ,, |
| ,, సిద్దాని అంకన్నగారు, మ్యు. కమీషనర్ | గుడివాడ |
| ,, శరణార్థి గౌరయ్యాగారు బి. ఎ. సబ్ రిజిష్ట్రార్ | గిద్దలూరు |
| ,, ఈదర వేంకటరావుపంతులుగారు (వేంకటరాం అండ్ కో) | ఏలూరు |
| ,, కీ. శే. దేవిశెట్టి అమ్మన్నగారు | నిడదవోలు |
| ,, ధాళాధూళి వీరయ్యాగారు | ,, |
| ,, రుద్రిశెట్టి గుండయ్యాగారు | చెన్నూరు |
| ,, పెద్దశెట్టి శాంతయ్యాగారు | ,, |
| ,, సాయం సిద్ధరామప్పగారు | శంషాబాదు |
| ,, డా. కె. రుద్రప్పగారు, ఎల్. ఎం. ఎస్ | హైదరాబాద్ |
| ,, ఏదుల రాజయ్యాగారు | ,, |
| ,, దండె చిన వీరప్పగారు | గద్వాల |
| ,, మాడపు శంకరప్పగారు | సికిందాబాదు |

Printed by K. L. Narasayya, at the Andhra Grandhalaya Press, Bezwada.